# యయాతిచరిత్రము.

ఈయచ్చతెలుఁగు ప్రబంధము

పొన్నికంటి-తెలగనార్యునిచే,

రచియింపఁబడినది.

రెండవకూర్పు.

రాజమహేంద్రవరము.

శ్రీ వివేకవర్ధనీముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

1895.

వెల 6 అణాలు.

# యయాతిచరిత్రము.

---

ఈయచ్చ తెలుఁగు ప్రబంధము

## పొన్నికంటి-తెలగనార్యునిచే,

రచియింపఁబడినది.

---

రెండవకూర్పు.

---

రాజమహేంద్రవరము.

శ్రీ వివేకవర్ధనీ ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

---

1895.

వెల ౼ అణాలు.

# యయాతిచరిత్ర.

## ప్రథమాశ్వాసము.

---

చ. సిరులమెఱుంగుఁబోఁడి తనచెక్కులు సిబ్బెపు గబ్బిగుబ్బలన్
బరువడి నాల్గుచేతులను బట్టఁగ నల్వఁదలంచి కేలుఁదా
మరఁ గుడికన్ను మూయుటకు మాటికి నవ్వెడు వెన్నుఁడింపుతోఁ
దిరముగఁ బ్రోచుఁగావుత మదిం జెలరేఁగి యమీనుఖానునిన్.

వ. అని యిచ్చం జెలంగు జేజేదొరం దలంచి యచ్చతెనుంగుఁ గబ్బం బొక్కటి యొనరింపం దలంచి యున్నయెడ

సీ. తెలఁగంటిదొరరాల తెగలఁ దీటైన కోటనిగనిగల్ నలుగడల్ నిండియుండఁ
దమ్ములవిందురా కొమ్ములదగదగల్ వెలుపుఁ బ్రోలిర్లు విరియఁజేయఁ
గొత్తడంబుల కెంపుక్రొత్తడంబుల రంగు నింగికిఁ దోపు వన్నియలు నింపఁ
గడలియేనని చిల్వపడఁతి జాలగడిత తెలినీటనే ప్రొద్దుఁ గలసియుండ
మినిమిబంగారుమేడలమీఁది యెడల । నిడినముత్యాలఁ జుక్కలఁ బడఁబడంగఁ
దెలియ కెల్లరు వెఱఁగందనలరు నెపుడు । మేలువజ్జీర్లగమి కొండగోలకొండ.

క. ఆవీడే లుఙ్ఞ సొబగుల । పూవిల్తుఁడు నిచ్చచాగపుంబులియనఁగా
దీవులకుఁ జాపుసాలకు । దేవర యిభరామశాహు తేజఁదరంగన్.

చ. దురమున నోడిపోయి పతిత్రోవలు గానక మార్తురెంత నే
ర్పరు లిభరామశాహువు తిరంబగు నందను జేరి తొంటియ
చ్చెరువగు సొమ్ము రాకొమరుచేఁ గడు ప్రెక్కులుఁ గాంతు రొఁగదా
పెరవరులైనవారలకు వింతయె యాసిరు లెందునుండినన్.

సీ. తెలివిసింగంపు గద్దియల రా తెలఁగంటిదొరలెల్ల మోడ్పుఁజేతుల నెకొల్వఁ
బూని యేఁబదియాఱు మానిసి నెలవుల పుడమితేండ్లా శిగంబులకుఁ జొరఁగ
తీవిమున్నీటిలో దీవులన్నియు నేలుమన్నీలు మెట్టుఁదావరల కెరఁగఁ
దన తేజు సుడిగట్టు వెనుకచీఁకటి నెల్ల విరియించు తమ్ములవిందుగాఁగ
వెలయు మలికిభరాముఁ గొలిచిమనుచు । కలనఁ దన చెయ్యిమీఁదుగాఁ గడిమి మెఱసి
మేలుసిరులందు నట్టి యమీనుఖాన । యొడయఁ డొకనాఁడు నిండుపేరోలగమున.

మ. పొంచెదుర్ చుట్టలు రాయబారులు దొరల్ । పోడల్ చెలుల్ మన్నె వా
రలు మావంతులు దీవులేలు బలియుల్ రౌతుల్ మొదల్గాఁ బనుం
గొలువన్ సంతసమంది కబ్బములు పేర్కొంచున్ బలిప్పించి నే
స్పలరంగాఁ దనదండ నుంచుకొని నెయ్యంబొప్ప మన్నించుచున్.

క. కలపషము చేసినగంధం । బలఁదించిన వెనుక వన్నియలపచ్చడముల్
పల్లుమానికముల సొమ్ములు । బలుతేజీలిచ్చికూర్మిపై పైఁబర్వన్.
మ. తనకున్నిచ్చలు మ్రొక్కువారినిసిరుల్ దైవారఁగాఁజల్ల చూ
పున నెల్లప్పుడుఁజూచి మన్పఁగలపెంపొప్పేడన్ మరింగంటి యా
ప్పనగారిన్ మదిలోనిమాట దెలియం బాటింపుచుంగాంచినన్
గనియామేటి తలం పెఱింగి పొసఁగం గానన్నుమన్నింపుచున్.
ఆ. వె. పిలిచిపొన్నికంటి తెలగన్న నీచేయు । నచ్చ తెనుఁగుఁగబ్బమన్నియెడల
మించివెలయుఁగా నమీనుఖానునకిచ్చి । పుడమిలోన సిరులఁబొగడుగనుము.
క. మున్నెవ్వడు నొడువనియా । తెన్నిడికడుమీఱియచ్చ తెనుఁగుం గబ్బం
బెన్నికమీఱఁగఁ జెప్పిన । నిన్నుంబొగడంగఁగలఁడె నెలతాల్పయినన్.
ఉ. అచ్చ తెనుంగుఁబద్దెమొకటైనను గబ్బములోనను౦డినన్
హెచ్చనియాడుచుండురది యెన్నుచు నేర్పనఁబొత్తమెల్ల ని
ట్లచ్చ తెనుంగున న్నొడువ నంచులచందమెఱుంగువారు నన్
మెచ్చరొయుబ్బురంబనరొ మేలనరో కొనియాడరో సినున్.
క. అనవుడుబళినాకబ్బం । బునకున్ దేఁటబ్బెఁదావిపుత్త్రుడికిం గ
ల్గినరీవిననుచు మదిలో । ననుసంతసమందికూర్మినన లెత్తంగన్.
క. తెనుఁగునను మాఱుపేళ్ళిడి । సెనఁచినవినఁగూడదనుచుబిరుసలుఁ జేళ్ళున్
మును వేల్పుబాసవెంబడి । నని చెదఁగాదనకుఁ డయ్యాయుల్లములందున్.
వ. అనిపలికిలాలసరి గజాంకుశుండును రాయపత్రిసాళ్వుండును సతకాసింహాస
నాధీశ్వరుండును సింగిణీసుగత్రాణుండునుదురగారోహణ రేవంతుండును సింహ
తలాటరాయండునునగు మలికిభరాముపాదుశాహునకు హితవరియైచదువు
లకుంగుదురై మన్ననలకెన్నికయై చెన్నొందునమీనుఖాన సింగంబువంగడం బు
నేర్పఱించెదనదియెట్లనిన.
సీ. మున్నీటిరాణియౌ విన్నేటియేవేల్పు నడుగుఁ గెందామరనలరుతేనె
బాసవాల్గముతెన్న ప్రాముక్కలేవేల్పు చెలువంపుఁబావాలగిలుకరవలు
కడిఁదిరక్కసిమూఁక మెడచాల్పలేవేల్పు చేనున్నసూడివాలుచికిలికళుకుఁ
గమ్మఁదెమ్మెర పూపదిమ్ము దానేవేల్పు మంచుమించులపాను పంచదూ
యతఁడుదానైన కర్తారుఁడలమికూర్మిఁ
బ్రోవసత్యచింతామణి పొట్ల చెఱువు

సంస్తుతిం దేపలుగ సిరుల్ గ్రందుకొనఁగఁ
బుడమి వెలసె హమామియా పుడమి తేఁడు.

క. కలిమిన్ని బలిమిని విడిమూడిఁ । బలుకులపస నీవిరీవి బంటుతనమునన్
వెలయుహమామియ్యాఅం । పిలుసొంపుల జాడుబీబిఁ బెండిలియయ్యెన్.

క. ఆమగువయందునతఁడు బ । డేమియ్యాఁ గనియె సందడింపుచు సిరులెం
తో మెఱయఁగ వెన్నుఁడు సిరి । చానువలన మరునిఁ గన్న చందము మీఱన్.

సీ. పూవింటివాఁడు నేర్పున సోయగంబున వినువాఁక బిడ్డఁడు వింటికడిమిఁ
దామరచెలిచూలి తగు నీగి నానచే రాముండు ప్రతినబీరంబునందుఁ
బుడమి తాల్పరి యోసిల్కుడఁబల్కు నేర్పున రాజసొంపున నిబ్బరంపుఁ దెలివి
నేను మోములమేటి హెచ్చగు బలిమిచే రారాజు సొమ్ముల రవణమునను
నెట్టివజ్జీర్లు నెన్నంగ నీడు గారు । కొమరుమీఱు హమామియా కొమరుఁడగుచుఁ
బాలుపుగనిన బడేమియా పుడమితేని । కహహ ముజ్జగములయందు నరసిచూడ.

తరల. పలుకుతే జవరాలి వేనలిఁ బాలసంద్రములోని యా
కలిమితొయ్యలి గేస్తు నెమ్మొయి గాలి మేపరితేని చూ
పుల బెడంగును బాసవాల్కను పూపకంపుఁ దలంచు బా
గులయసంబు బడేమియా తనకున్ సతంబుగఁ దాలిచెన్.

వ. అంతం.

క. కలిమిచెలి వెన్నుఁడుం బలు । కులతేజవరాలు నాలుగు మొగములతఁడున్
బలెఁ దగు సిలారుబీబిం । గొలమలరఁగఁ బెండ్లియయ్యెఁ గూరిమిమీఱన్.

ఉ. చుట్టపుహారి రాసిరుల చూపులకోపులకైవులా నిచే
పట్టియుసంగుగాన డవు ప్రాపగు కూరిమి నా బడేమియా
పట్టపురాణియై కలిమిఁ బాటిలుచుండు సిలారుబీబి రా
ప్పుట్టువనానిలంతకును బాటియె యెన్నఁగ గట్టుచూలియున్.

3. తే. ఆసిలారుబీబియందు బడేమియా । పుడమితేఁడు సిరులఁ బొందునట్టి
కడఁక తోనమీనుఖాను వేల్పులతేనిఁ । గనియె మదిని గూర్మి గడలు కొనఁగ.

క. అనువుగ మతియు నతఁడు సర । బనబీబిం బెండ్లియాడె బలువేడుకతోఁ
గనియెం దగ నాయమయం । దును బాబను మియ్యా నీవితో వచెలి కానిన్.

మ. కలనన్ బాబనుమియ్యా సింగముకడంకన్ మార్తురేనుం గుజం
గిలిఁ జేకైనువనొంచి వానితలలం గీల్కొన్నమున్ తైంబు తే.

తలఁ ద్రెళ్లల్గా నని నేల పెండ్లపుగు గాఁ దా సొంపుతో మీఱుచున్
గెలుపుం బైఁడి నెలంతఁ గైకొనియె నగ్గింపన్ జగంబంతయున్.
సీ. పట్టుంగ నీఁడు సంబళికలు కలనిలోఁ జేరవచ్చిన మార్తు చేతఁ గాని
పూన నీఁడ దక్షపంబు పొగరుతో బవరంబు సేయవచ్చినవాని చేతఁ గాని
తేనీఁడు గొడుగు మత్తిల్లి యాలంబులోఁ జేఁబడ్డ మన్నీని చేతఁ గాని
తాల్పంగ నీఁడు కుందనపు ఝూరీ చప్పఁ జెనక వచ్చిన తేని చేతఁ గాని
యతనిఁ గొని యాడ నలవియే యైన తలల । వేల్పు రాయనికైనను వేయి తలల
ప్రోడకేనియు నని చాలఁ బొగడ నెగడె । నిందు వేడ్క నమీను ఖానుండు ప్రదమి.
ఉ. మించియమీర్ఖానుఁ డెలమిన్ గలబట్లకు నెల్లనిచ్చుఁ బ
ట్టుంచుల పచ్చడాలు వరహాలు సరాలు గుఱాలు పల్లకీల్
కుంచెలయందలాలు గొడుగుల్ పడగల్ కడుతోరహత్తుగా
నెంచఁగ నెవ్వరీడతని కీగి పసన్ బరికించి చూచినన్.
సీ. పలపలనై ప్రమానుపడి పండ్లు చూపెడు ప్రడుకుఁ జెట్లను వేఁడఁ బోవనేల
మించు చూపుచు నెనమ్మించి నిల్కడయేది విసమొసంగెడు మబ్బుఁ గోరనేల
యొల్లి వోయియూ లేక యొకపూఁట పెట్టెడు తామరచెలిఁ బట్టఁ దడవనేల
పొరలంగఁ బడుచుండాఁ దరమఱుంగు ననుండి కసరెడు మున్నీటి దొసఁగనేల
తెలివిగురికొల్పి నిచ్చలు పలుకుఁ దియ్యఁ
దనము గాన్పింప నొసఁగెడు దారిచేత
మిగులఁ బొలుపొందు నట్టి యమీనుఖాన
యొడయఁడొప్పుల కుప్పయై యొనరుచుండ.
సీ. దరములో ప్రేఁటూలు తునుకలుగా ప్రేయునట్టి రౌతుల కెల్ల నాటపట్టు
తొడరి బెబ్బులి నైనఁ బెడకేలఁ బడఁద్రోయు పూఁపగల్గిన బంట్ల పుట్టినిల్లు
నట్టి ప్రమాఁకుల నిగుర్చెట్టెడు పాటలఁ బాటిల్లు గాణల పట్టుఁగొమ్మ
పుట్టుఁబుట్టిన ప్రోడపొల్పునఁ జెప్పఁగాఁ గలుగుజాణల మొత్తములకు నెలవు
నైన తన పేరఁ గల్గు నమీను పురము । నందు మున్నీటి జోకఁ జేయంగఁ జాలు
చెఱువు త్రవ్వించె మిగుల నచ్చెరువు గాఁగ । నిందు వేడ్క నమీనుఖానుండు మెఱసి.
ఉ. తామరతంపరై సిరులఁ దార్కొను కొసలనాటి సత్యవిం
తామణి పొల్పు చెర్లను సతంబగుచుండ నమీను ఖానుఁ డిం
పామతిలంగ నిల్పఁ బోడపైఁ బెడఁగైన మసీదుఁ గాంచి యం
దెమను కొంతి కొండపయి కేగఁ దలంపక చేసికొంటి యున్.

సీ. పాడవుల కెల్లఁ బాడవు ప్రోడలు నెమ్మదిలోనఁ గాంచు ని:
ల్కాడ కడలేని తేజునజగంబునకవ్వలియైన వెల్గు నె
య్యెడలను బొందువారలకు నెక్కఁగనిచ్చెన యామసీహ నిం
పడరక మీనుఖాన యొడయుండు తిరంబుగ నిల్పెఁ బొల్పుగన్.

చ. కడకన మీనుఖానుఁడు జగంబు తనుఁ బొగడంగ వేడ్కతో 25 4 60
విడువక యెప్పుడున్ బుడమి వేల్పుల బిడ్డలఁ బెండ్లి చేయఁగా. 25.3.73.
నటరేడు బీతలోఁ బాడను నంగు కతంబునఁగా దెదూఱుఁ జే
రడవులలో పఱెన్ దబిసిరైకను పట్టెడు గాలి చూలియున్.

ఉ. దొమ్మిన మీనుఖానుఁడిఁక దూకొని గెల్పులఁ గొన్న సొమ్ము లా
నిమ్ములలిబ్బులన్నవవి యేన్వశజక్కుల తేఁడు గాంచినా
తొమ్మిది లిబ్బులున్ బలిమితోఁ గొనసాయనుచుం దలంపులో
నమ్మక కాచియుండు జతనంబున రేలుఁబగళ్లు నెంతయున్.

క. అబ్బురమై పాలుపొందెను । కబ్బంబులు చాలనంది కనియెన సంబుల్
నిబ్బరముగఁ బొడమెడు చే । రుబ్బున నల్గడల జాణలోహాయనఁగన్.

సీ. మారేళ్లు నేరేళ్లు మామిళ్లు జిన్నలు మాదీఫలంబులు మాదిఃమ్మ
లీడెలు మేడులు జీడులు దాడింబ లనట్టులు పనసలు చనుపకములు
పొగడలు పొన్నలు పొకబ్రాఁకులు కమ్మరేగులు నిమ్మలు రేగులిప్ప
లంబాళములు కజ్జూరంబు లనాసలు నారికడంబులు నారదబ్బ
లగరు తేలకి విరవాదియాకుఁదీఁగె । వల్లియలు గొజ్జఁగులు దాక మొల్ల మొగిలి
మొదలుగా నివియెప్పుడుఁ బూచికాచ । యుండు తోఁటల మీనుఖానుండు నిలిపె.

ఆ. గీ. ఏచిననిచి ఫ్రూచికాచి పండిన యమీ। న్వగము మేలితోఁట లరసి కాంచు
ముసలివారికైనఁ బసిబిడ్డలకునైనఁ । బండ్లు వచ్చునలతిఁ బ్రోయమొదవి.

క. చలిపందిరులును సత్రము । వులునూతులు బావులుం బువుందోఁటలుఁ జె
ర్వ్యాలు నల్లిండ్లను మొదలుగ । నిలిపియమీర్ ఖానుఁడ సము నించెంబుడమిన్.

క. ఇట్టి గొనేటిబులచే నె। ప్పట్టున నెన్నంగఁదగిన బలియుఁడ సొంపుల్
నెట్టుకొనఁదనకుఁ దగియెడు । పట్టపురాణులను గూర్చి పైపైఁబర్వన్.

క. గరితబడేబీబ్బిన్ నె। క్కరబీబిన్ నెమ్మబీబిఁగను పట్టెడు రా
మురుఁడగు నమీరుఖానుఁడు । సిరులొదవఁగఁ బెండ్లియాడెఁ జెలువలరఁగన్.

వ. వారియందు.

జాలిన్నవాఁడుసొంపులను జందుఱఁడెంచగ తానుఖానునిన్
బోలినవారుగల్గుదురె పుట్టినవారలఁబుట్టువారలన్.

వ. అతనితమ్ముఁడు.

మ. అనిలోమార్కొనుమార్తు తేండ్లఁ గడు నెయ్యంబొప్పఁగా వేల్పు శ్రీ
స్త్నసబోఁడ్ల గెలయంగఁజేసి మరికానల్ గట్టులున్ వాఁకలే
యనుకుల్ గానొనరించెఁగొండటికి నోహో మేలు ఫాజీలు ఖా
నునకున్ సాటిపెలంప నెవ్వరికి నెంచున్ గ్రందుగా నెన్నినన్.

చ. కనితనురాజు లెన్నుకొనఁగాఁ బెనుపోఁజులతో సిరంగరా
యనికడ కేగ్గిమాటలనె యాయనఁదేటిచి తెచ్చిమల్కున్
మనుకువనంటు చేసి యొరిమంగడు మెచ్చులుగొన్న మేటి నే
మనిపొగడంగవచ్చు నవునా నిఁక ఫాజిలుఖానరాయనిన్.

సీ. తగువేల్పుదొర రాణిమగమానికపుసొమ్ము నెగతేనిచానగొజ్జఁగుల బంతి
జతు గేస్తురాలి మైనమరుకప్రపుఁబూఁత పొలదిండిరా తేని నెలఁతనగవు
నీటిరాయనికల్కి నిద్దంపుదువ్వల్వ తెమ్మెరకొమ్మ చే తెల్లదమ్మి
మఁక్కంటి చెలిలేమ ముత్తెంపుఁజేర్చుక్క నెలతాల్పు పడఁతి పన్నీటిజలక
మగుచుఁ జిలువలగమికానిఁ దొగలతేనిఁ । గ్రిందమీఁద నడంచి యేకందు లేక
యొఱమి ఫాజీలుఖాను నియసము లెపుడు । సకలజగములఁబండువెన్నెలలుగాయు.

సీ. మదిలోఁగియలనిజామనమల్క పెట్టిన పల్లకీలొకవంకబాగుమీఱ
నుదిరియేదుల ఖానుఁడొసఁగిన పైగోవగుఱ్ఱముల్ బడివాఁగెగొల్చిరాఁగ
వేడుకతో నేడు మాడెలదొరలు కానుకలంపినట్టి యేనుఁగులు చేరయ
కన్నడరాయేఁడు మన్నించియంపిన ముత్తేలపెట్టెలు హత్తి మెఱయ
వచ్చి తెచ్చినసొమ్ములు మచ్చికలర । నిచ్చియిభరామశాహు చే మెచ్చుగనిరొ
నట్టి ఫాజీలుఖాన రాయనికి సాటి । గలరె నేర్పరు లెల్లజగంబులందు.

వ. మఱియు నమీనుఖానుని తెండవదేవేరి యొట్టిదనిన.

గీ. కలికినిజమూరిజాణబింగారుకుండ । వన్నెవాసిగమెలఁగెడి పిన్నపెద్ద
చుట్టముల పాలితంగెటిజున్ననంగఁ । జేర్మిఁజెలువొందు నెక్కరబీబి యెపుడు.

క. ఒఱపరి నెక్కరబీబి । తెఱవంను నమీనుఖాను దేవరగని యొక్
నెఱజాణ్నబిడ్డలల్లిరి । మఱియును షేకీభరామమరని బేరిమన్.

సీ. తనరూపువలయందుఁ దలిరాకుబోఁడులకనుఁదమ్ము బేడిసగములు దగులఁ
దనచాగమనుమబ్బు మొనవేఁడువారను చినుకు మేపు డుప్పుల్లు లెనసిపొదలఁ

దనయేడుగుండమ్ములను రాచనెత్తెంపుఁబలుదిండి రాతుమ్మెదలు మెలంగఁ
దనపరంజీచిల్వకును మూర్తురా తేండ్లయసురుగాడుపు లింపులొసఁగుచుండ
నౌశరు నిభరాముషాహుశాహుజురునందు| బొందుగా వ్రాయనేర్చిన ప్రౌఢయైన
యబ్దులల్లికినీడెవ్వ గరసిచూడ । నహహాగానములనతనికి నతఁడెతగును.

క. అరబీపారసికన్నడ । మరుమీకన్నొజితెనుఁగు మొదలగుబాసల్
పరికించి కుతుబుశాతలఁ । పరయుచుఁబాలుపొంనునబ్దులల్లీపుడమీఁ—

ఉ. కంటినివింటినేర్పునను గావకకయ్యమునందు నొంచినన్
వింటికినేగివేలుపుల వీటనుజూపుకటారికత్తెలా
దంటలగుబ్బచన్నుల తుదన్నెలకొందురుమార్తురౌర య
వ్వింటికినబ్దులల్లిబలుని టికెఁ గిలదియేమిగల్గెనో.

కే. అతనికిఁగూరిమితమ్ముఁడు । సతముగ షేకీభరాముచదురుఁడు పగరం
దరిఁగూడుకొకలరయని । ప్రతినలువట్టించి మలలపజ్జలకనిచెన్.

మ. అరయన్ షేకిభరాము రానెలకుఁ బ్రాపైనట్టిలోఁగూర్మిచే
సిరియుంబల్కులతమ్మికంటియుఁగడుంజేదోడు వాదోడునై
వరుసన్ బ్రిమ్మరుచుందురన్న మతికై వారంబుగావింపఁగాఁ
దరమేయాయనచాగముంజనువులుందా నొక్కముక్కంటికిన్.

వ. ఇంకనమీనుఖాను మూడవజవేరియెట్టిదనిన.

కే. వీడమతనచుట్టంబులఁ । జూడనుపెఱవారి మగని చొప్పరయక మా
టాడదుపలువేల్పులఁగొని । యాడదహాహాసెమ్మె బీబి నలసియెపొగడన్.

క. తగునట్టిసెమ్మెబీబీ । మగువయునుమీనఖాన మగసింగముసొం
పుగఁగాంచిరబ్దులకరీ । మగొనంబుల ప్రోకఁజాగములతోగితేనెన్.

సీ. మాటనేర్పనరాజు మదిఁగూర్మినింపఁగా నలరించునెప్పుడబ్దులకరీము
వలతేనెకైవడిఁదలిరాకుబోఁడుల వలపించుజాణఁడబ్దులకరీము
పారసియరబులేర్పడ వ్రాయఁజదువంగనలువ తలంప్పనబ్దులకరీము
అడుగువారలకులేదనుమాట తనమదిఁదలఁపఁడెన్నఁడునునబ్దులకరీము
మించియిభరాముశాహు మెప్పించిమేలు
తగటుదట్టల్కుళ్ళాయీలు పొగరుమిగులు
గుఱ్ఱములు నందలమ్ములు గొడుగుగాంచి
కలిమిపొగడొందెబుడమినబ్దులకరీము.

చ. చదువుల ప్రౌఢ నేరుపరి జాణలు మెచ్చఁగ దంగిదాయలన్
గడిమి యడంచి గెల్చి సిరిఁ గైకొని మించిన మేటి యెప్పుడున్.
మదిఁ దవ్వవేలుపున్ దలఁచి మల్కిభరాముశహాను గొల్చుఁ గూ
ర్మి దయలువార నబ్బుల రీమునకున్ సరియెవ్వరిచ్చటన్.

వ. మఱియు మెఱయు సిరులకు నెలవై తమపేరఁ దైన హజరతి మొఖ్ఖిముంజిఖాదిరి యదుగుందమ్ములు తలంపులో నెలకొల్పి గతాతఖానుండును ఫాజీలుఖాన యొడయండును నబ్బులల్లీరాయండును నబ్బులకరీమును వీరలకుఁ గూరిమి తమ్ములైన తసీరు నిహాజరతి శేఖుబుసురుదిఖాదిరిని మదిందలంచు శైఖిభరామునందనులు దనర్చిరి.

ఉ. ఇట్టి కొమాళ్లరాసిరుల హెచ్చఁగ మించిన ప్రౌఢ యేలికై
పట్టపు తేండ్ల మ్రొక్కఁగని పాటిలు నాయిబ్రాహిము శాహు చే
పట్టియనుంగు గానదుపఁ బాయక మాదుతరాలనుండి క
న్పట్టున మీను ఖానుఁడు రపంబున మించె నసంబుకల్మి చేన్.

షష్ఠ్యంతములు.

క. ఈగోనములఁ గడుమీఱుచుఁ । జాగపు మెఱవడిని వేల్పు జన్నియను నేలన్
వేగన్నులదొర మ్రొఁకుల । చేగంగైకొనని యోగి చెలువపుశిబికిన్.

క. నిగనిగమను నెలకలుబలు । చెగలను వెలిపులుఁగుఁబదువుఁ డెలికొలిగలుగమిన్
దొగలన్ వగలన్ జగులన్ । మిగులన్వాడి నవ్వ్వన సపుమిసుములగమికిన్.

క. తనవారిమనుప మార్తురఁ । బనిపంపఁ గొలంబు నిలుప బలిమిని బుడమిన్
తనరఁగ మానిసితనము । నినకటివేల్పునకు రాచనెల తాల్పునకున్.

క. గమకమున నెదురుపగతురఁ । గొమరుంబాయములవేల్పు కొమ్మలఁ గడుఁ జు
ట్టములఁగఁ గూర్చెదు నేరుపు । సమకూటిన రాయపక్షి సాళ్వంబునకున్.

క. పలుతలఁపులఁ బోలు పగుతన । తలవాకిట నెప్పుడుఁ బలుకుతలిరుంబోఁడిన్
బొలుపుగఁ గాపురముంచిన । మెలఁకువగల నేరుపరి కమీన్ఖానునకున్.

వ. సిరులుం గెడునవురు కొమరులుం గలిగి మనునట్లుగా నాయొనర్పం బూనిన యబ్బురంబగు నబ్బలు గబ్బంబునకుం బ్రావయగు త్రోవయెట్టిదనిన.

సీ. తగఁ గోటఁ దాచిన మగపూనికంబుల తెలిరంగు లెప్పుడు వెన్నెలలు గాయ
మేతలపైసొంపు మెలఁతలు దెఱగంటి కొమ్మలు నేప్రొద్దుఁ గూడి తిరుగఁ
జిలువచామలగడ్డ వలినీటిపైఁ దేలి యొరిమతో ననయంబు నోలలాడ
మేలిమి బంగారు మేలిపచ్చలడాల్ మిసిమి మింటికి నెల్లఁ బసిమి యొసఁగ

జడలల్లోసిన శొమ్ము చాలుకతన । మీఁదరారాక యలప్రొద్దు మెఱుఁగుదేఱ
గీవనులనె రాకపోకలుగా మెలఁగఁ । దనరుఁ బుడమిఁ బ్రతిష్ఠానమనఁగఁ బీడు.

క. పొడవగు బంగరుమేడలఁ । గడువేడుక నాడుపడఁతుకల మొగములతోఁ
దడఁబడుదు నంచు రేఁడ్ । గడకడఁ జనుఁ జందురుండు గ్రందుమునపడ్.

చ. కనఁదగు తెల్లమానికపుఁ గప్పులనొప్పదు చప్పరాలలోఁ
దనపొడవైన నీడగని తారక యేనుఁగటంచుఁ గొమ్ములం
జెనకఁగవచ్చి కోటుపటుఁ జేసిన దుత్తెపుసింగపుంగమిం
గనుఁగొని పాఱు వేల్పు బోరగొరతఁడౌదల మస్తరిలేవఁగన్.

మ. తళుకుల్ గుల్కెడునంచు మేడలతుదన్ దాఁద్రొక్కన్న బంగారు కుం
డలుమిన్నేటను గానిపించుచును విన్నాణంపుఁ దెల్వింగడున్
విలవిల్లం గని పైఁడితమ్ములనుచున్ వేల్పుంబుఱుంబోండ్లు చే
తులఁదేరం జనఁజూచి నవ్వుదురు రంతుల్ గాఁగ జేజేదొరల్.

చ. దళమగునంచుఁ గోటలతుదం దవిలించిన మించుపైఁడిబ్రాఁ
తలకతి చెక్కడంబుల్ గని యెదన్ మెఱుఁగుల్గల మబ్బులం మరం
పిలితగనాడ నన్నెమలి పిండుఁగనంగొని చిన్కకూటియ
ప్పులుఁగులు సంతసిల్లుఁ గడుపుల్ గటుబిండఁగ సానుకోర్కులన్.

క. అగడితలోఁ గెందామర । మొగడలు గనుపట్టుఁ జాల మూఁకై చూడం
జగి మున్నీటం దేలుచు । నెగడని వార్వంపు టగ్గిపిల్లలువోలెన్.

సీ. మెఱసి పోఁకకలిచ్చి మెలఁతలై యెఱుపుచేఁ దిలకించు క్రొమ్మించు తీవెలనఁగఁ
గప్పారుతోంగలి తెప్పలల్లార్చు కన్నవల నొప్పెడు వేల్పుటువిదలనఁగఁ
గడుసోయగంబు చేఁబుడమిపై నటయాటఁబొలుచు మేలిమి పైఁడిబొమ్మలనఁగ
సింగార మమరంగఁ జిరిలిచేయించిన వలరాచవాని పూమలుకులనఁగ
నలువతాఁజేయఁగలిగిన పొలుపుఁగూర్చి । కరముఁజేతులఁబట్టినఁగందఁ జొచ్చుఁ
దలఁచెఁగొమ్మలు గానన నలరుసట్టి । పువ్వుఁబోఁడ్లుదనర్తురా ప్రోలిలోన.

ఉ. ఇంచుక కేలవాగె గుదియించిన సంద్రముదాఁటుచున్ జవా
యించిన నేలగ్రక్కదల నిట్టటుగావడిఁ ద్రొక్కుచున్ మవా
ళించిన గట్టుగట్టుక తెక్కలు మిక్కిలి దవ్వువాఱుచున్
మించిన వారువంబులటు మీఱుచుఁ ద్రిమ్మరునెన్ని యేఁ యెయున్.

చ. ఎనిమిది తావులందొడరి యేపుగనెప్పుడు నామజాలఁగా
జెనయుచుఁ గెంపుఁదేకలు పయిం బొలుపొంఁదఁగ నంబనేనుఁగుల్

చనర్చుచునుండు నాకసము దాఁకెడు నిక్కునఁ జూపఱబ్బురం
బన నెల యేళ్ళతోఁడ నడయాడెడు జేగురుకొండలోయనన్.

సీ. జిలుగులై తళుకులు గులుకుకన్నులచెన్ను కలువలకొకయింత చెలువుగొలుప
గొప్పలై యొప్పులకుప్పలై పాలిండ్లు విరిబంతులకు వింతసరవిఁ గఱపఁ
జాలుపులై వలరాచ బులుపులై పలుమొనల్ మొల్లలకొకవింత మురువునింపఁ
దళుకులై తేనెలు చిలుకు మోవులరంగు చెందొవలకు వింత సిరులఁ జేయ
సొలపువలపుసోఁగ లుపునిచ్చలపుఁ దెలుపు నగవు మల్లెలకొకమింతనయము దెలుపఁ
గోడెకాండ్రకు విరులమ్ము కొంచు రెపుడుఁ। బువ్వుల మైదుచెల్వ లాప్రోలిలోన.

సీ. నగఁగల్గినను జాలు మొగసాలవాకిలి కావించు నవ్వేసికొంటినైనఁ
జనిచూడఁగల్గినఁ జాలుఁ జేయునునన్ను కానిగాఁ బూవిలుకానినైనఁ
బలుకఁగల్గినఁ జాలుఁ బనులు సేయించును వెట్టిమైఁ జదలేటి పట్టినైనఁ
జెనకఁగల్గినఁ జాలుఁ జేయునుదన యింటిచుట్టుఁ ద్రిమ్మర గాలిచూలినైన
నంటఁగలిగిన నవ్వేన కయ్యనైన
గోఁచివిడిపించి వలపులుగొల్పి నిచ్చ
వెంటఁ దిరుగాడఁ జేయు నవ్వీటిలోనఁ
గలుగు వెలయాండ్ర గని పొల్పు వలఁదిగిచి.

క. పలుకుల చిలువల దొరలన। నలుమొగములు పూనిరాని నలువలనంగాఁ
దొలిమినుకుల ప్రోవులనన్। వెలయుదు రవ్వీటి పుడమివేల్పు లెపుడున్.

సీ. వరుసవెంబడిఁ గాని పోరిగోన లేఁడయ్యె మార్తురన రాముమనికి దెంత
దురముల్లో సిరిగెల్చి నెరసొచ్చి పగవారి గెలిచిన కవ్వడి యలవదెంత
మూఁడుపాళెములు తెంపున గెల్చి పోదలు జాబిల్లి తాలుపు వేల్పుబీరమెంత
కోటిసైదోడుఁ గూడి త్రిమ్మరి పేర్మిఁ దగు విక్రమార్కుని తెగువదెంత
నేలపైఁ ల్చి తమ రేపు నిలుపలేక। పెడిదమునఁ బర్వు పిడుగులకడిమి యెంత
యనుచు గేలిగ రచ్చల నాడుకొనుచు। నేచి వచరింతు రచ్చటి రాచవారు.

క. తడవఁగ వసమా యందుల। నడపని సిరులేరికైన నెలుఁగఁగ వచ్చున్
నాడువ కోటికి నెత్తిన। పడగల చేఁ గోమటిండ్ల బంగరు మలిగల్.

క. గడితపుఁ బిడుగులనైనను। పెడిదపు సింగములనైనఁ బెడచేఁ బడమిం
బొడనడుచు బంటులెన్నఁగఁ। గడ లేక తనర్తురచటఁ గడు బీరములన్.

వ. ఇట్లు కడలి కడ దాఁగలుగు పుడమి పడఁతికి దొడవసంగము నొప్పు నవ్వీటిరేలు నేలు
తేఁ డెట్టివాఁడనిన.

సీ. విన్నీరజ తలఁగల్గు వేల్పునెఱదలపువ్వు తలఁపనెవ్వని తాత తాతతండ్రి
కలువలచెలికాని గారాపుఁబట్టియై తనరారు నేతని తాతతాత
దీవులు పదునెన్మిదింటితో నేలయంతయు నేలె నేతని తాతతండ్రి
తనయాన నుడిగట్టు వెన్న కఁబర్వఁగఁజాలఁ దేజనమించె నేరాజుతాత
చేరి జేజేలు మఱిఁజదారిగములు
నచ్చరలుఁగొల్వ వేగన్నులతని మొదలి
రాచ నెలవేలెఁ జేర్మి నేరాజతండ్రి
యాతఁడుగొనియాడ నెగడెయయాతిపుడమి.

సీ. తనవాలు మొక్కఁటికెని మార్తురగు రాచగము లెల్లఁబూవిలు కాండ్రుగాఁగఁ
దనరూపువలకుఁ బైదలుల సెమ్మదులెల్ల వేలైన దేశిసమీలుగాఁగఁ
దనయీగి తొగతేనికిని వేఁడువారెల్లఁ దులకించు కల్వల తుటుముగాఁగఁ
దనగెల్పు పట్లవ్రాఁతలకు మున్నిటి యవ్వలచున్న నుడిగట్టు పలుకగాఁగఁ
దనదు తేజుజగంబనఁదగినతమ్మి । కొలఁకునకుఁగోర్కులిడు వేఁడివెలుఁగు గాఁగఁ
గడలిలోఁగొనఁగల్గిన పుడమియెల్ల । నానకును లోను గా నేలె నయ్యయాతి.

చ. అనికినెదుర్పఁజాలు దొరనారసి కానక యయ్యయాతి దాఁ
జెనఁకువ మేటిజన్నములు పెక్కులు చేసి పసిండిఁబాఱులం
దనుపఁగ దానినిచ్చునని దయ్యపుమూఁకలు పైఁడికొండపై
ననయముఁ గాపురంబులుగ నన్నియుఁ గాచుచు నుండు నెంతయున్.

చ. తోఁటలు లేని త్రోవలును దోరపుజన్నపుఁగంబముల్ గడుఁ
నాఁటనియేటి పెన్దరులు నా డెప్పుఁబాఱులకీనియాళ్ళు నీ
లాఁటని గాటపుం జెఱువులారయ నబ్బుర మెంచి చూడ న
మ్మేటియతియా యేలు పుడమిం దగునబ్బలియుం దలంపఁగన్,

సీ. తలఁపఁడు జేజేలు పొలసుదిండ్లనుగొండఁ గలఁచిన నాఁటి యంకిలియొకింత
యొఱుఁగఁడు తనలోన నేప్రొద్దుఁబాయక యెర్చువార్వపుటగ్గి యొగ్గుమదిని
మఱచెఁ జాల్పేరింటి మగువనేలిన వేల్పు ఒలుకు వేఁకిమినిఁకొకలఁగఁబడుట
యెఱుఁగఁడు మత్తిల్లి పరఁటి పుట్టుపుగ్రుక్కఁ గొనిన యప్పుడు గలకుతిలపాటు
నయ్యయాతిగడంగి నెయ్యమునఁబుడమి
వేల్పులకుఁబైఁడి యొసఁగెడు విడుపునీట
నిండి కొదవేమియును లేక యుండెఁగడలి
యతని చాగంబు లెంకనెన్న నలవియగునె.

క. ఆనాఁడు వేల్పు రాయఁడు । వేరప్పఁ బేరెంపునైన విన్నఁబడకుండం
దోరముగఁ జిల్వతేనికి । నూరటగాఁ బుడమిఁ దాల్చి యొకనాఁడాతన్.

సీ. పదియాఱువన్నెల పసిఁడిగోడల చెంతఁ దిరమైన కస్తూరి తీనియలును
పాపమేసరిచ్చు పలకలఁ జెంగల్వ దొరతాలఁ దీర్చిన మాలములును
మగమానికంబుల తెగలబోదెలచేఁత పగడంపు గొప్పకంబములగములు
పెద్దతామర కెంపు బిగిపట్టియలచేత సొబగైనముత్యాల సోరణములు
వాసియేనుంగు కొమ్ములఁ జేసినట్టి
బోరుతలుపులచేతఁ గప్పురపుఁబనుల
మొరగులునుమించు కొలువుకుప్పరిగలోనఁ
బరఁగు గొజ్జఁగి చల్వచప్పరమునందు.

సీ. అలవేల్పు దొర పంపినట్టి తలంపురా పనియడ్డపంబొక్క పడఁతి చాల్పఁ
జెలిమితోఁ దామర చెలి పట్టియనిచిన బలునరంజీ యొక్క చెలువ పూనఁ
గలఁగి గాడుపుతేఁడు కానుకంపిన తెల్ల వీచోపు లిద్దఱు వెలఁదు లిడఁగఁ
బైఁడిరాయఁడు కూర్మిఁ బనిచిన సెత్తమ్మి కెంపుగిండి యొకర్తు కేలనలమ
వెండియును సేలచెఱఁగుల నుండు రాజు । లరికినిచ్చిన కన్నియలు సకువలను
గదిసి కట్టడయగు నూడిగములు సేయఁ । బచ్చసింగంపు గద్దియపైఁ జెలంగి.

క. మానికపు సొమ్ము రంగులు । పూనికఁ గనఁ దైన మేని పొలుపునకుఁ గడుం
గానని యారతుల యితగఁ । నాకమరుఁడనఁగ నొఱపుఁదనముఁ నొఱపై.

సీ. ఆహోపరాకు విదేహుని కానుకే సొబగైనయట్టి కస్తురి మెకంబు
లెచ్చరికయ్య మాహిష్మతియేలువాఁ డనిచినాఁడీ చిన్నయలుఁబోండ్ల
నవధారు కుంతలుం డంపినవీయాము పొగరుచే మీఱు నేన్గుల గముల
చిత్తగింపుము స్వామి సింధురాజంపెను వడిమీఱు నీ మేటి వారువముల
ననుచుఁ జేరొక్క నికటికవాండ్రగ్గలంపు । రవళిగాఁ జూపి తెలుపఁగాఁ దవిలి పౌని
నల్లనల్లనఁ గనుఁగొంచు నల్లసిల్లి । యపుడు పేరోలగంబుండె నయ్యయాతి.

వ. అంత.

సీ. గురివెంద పట్టెల్ల కనుదోయి సందిళ్లఁ బీలిదండలు గూర్చి చాలఁ దొడిఁగి
యెడనెడ పికిలిపూలిడిన సంకుల పేర్లు కొరెంద పూసలఁ గూడఁ దాల్చి
గుఱితగా మెఱయు జేగురుపొట్లమీఁదఁ దంగేటిపూఁబొరలు రాగిల్లఁ దాల్చి
బలుపైన పాలుటాకుల బొట్టు దట్టిపై ధింతుగాఁ దీగెల పిండుసుట్టి
కుఱుచ చేతులు మిడిగ్రుడ్లు కఱకుమీస

సీ. చెవులకీతెల్లయుచ్ఛ్రితకాయలెంతేసి పారటాకులది కుప్పసమిదప్ప
లయ్యకుఁగట్టనెం తరటాకు గగ్గెరా యీపచ్చతాడిబిల్లీశదొకొ
వెళ్లఁజుట్టినపెట్టి వేల్లోకొ చేతులఁ బండుదీఁగెలవి గొప్పలుకడేలు
తలకువేసీఁకలో తాల్చిరియీలాగు నీయచ్చగురిజపే రెండుఁగలి నె
రాజు గాఁడన్నకంబమురాయఁడితని
వేసమును మేలు బాగెము సేసియుంట
నిపుడు గనుఁగొంటిమనిపల్కు నెలుకుదొరల
ముగుదమాటలువిని చాలనగుచు నలరి.

వ. చనుచున్నెడ నిచ్చోటు వేఁటకు వాటంబని వేఁటకాండ్రు విన్నవించు మాట
లాలించి వేఁట వెట్టుమని పుడమితేఁడానతిచ్చిన.

చ. దురములవారువంపుగమి త్రొక్కఁగఁ జేచిన దుమ్ము గ్రమ్మినన్
బురుదయి యుండునాకడలిఁ బూనిక నేనిక మూఁకఁ గేసి పే
మరుబుసకొట్టుఁగా నెగయు మవ్వపు డుంపు రసీటి చేతరా
సిరిపయిఁ గూరిమిన్ మగుడఁ జెల్వుగ నించిన యాభగీరథా.

క. తెల్లివిన్ బుధమిన్ దగుర । ల్వలరాయా మైదనర్చు వలరాయ కడున్
గలనైన వీఁగెఱుఁగక । కలనైన నైఱయు పెంపుగల ముక్కంటీ.

మత్తకోకిల. పౌరులం దెగిసిన మాద్రుని ప్రొద్దునెన్నడు మొక్కటన్
జేఁబల్విడి దూఱి బంగరు చేలయున్ సిరితో డిసిం
గారమున్ సుడివాలు చిందము గల్గి సొంపులమీఱుచున్
రారువేలుపుఁ జానలిండ్లకు రాసిరిందగు నేర్పరీ.

గద్య. ఇది శ్రీమదన గోపాల మంత్రిప్రసాద లబ్ధసారస్వత సుకవిజనవర్ణనీయ వచో
విభవ భావనామాత్య తనూభవ పొన్నికంటి వంశవర్య తెలగనార్య ప్రణీతం
బైన యయాతిచరిత్రంబను నచ్చ తెనుఁగు కబ్బంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

## ద్వితీయాశ్వాసము.

---

క. సిరివంటి బడేబీబీ । విరిబోఁడికి వెన్నుఁడనఁగ వెలయుచు మిగులన్
గరకరికలఁ దనరెడు రా । సిరులందు నమీనుఖాను చెలువము లగమీ.

వ. అట మీఁది తెఱంగు వినుండు.

సీ. కంబళ్లకై రోమములు గలిగించు నీకొక్క గరటాలు వంతుగాఁ గానుకిత్తుఁ
గాఁ బ్రేఁడ మేకములకడుపు రాఁ జేయుమీ జింకనొక్కటి నీకుఁ జేరిత్తు.
మలలమ్మ వేఁటలో మా పాలఁ గల్గుమీ సింగంపుఁ గోదమఁ దెచ్చెదము నీకు
దుర్గమ్మ కాలుపోతుల లోను సేయుమీ తోలి ముద్దగా నిత్తు మంతనొకటి
యనుచుఁ దమ వేలుపుల నెల్ల మనుదలంచి
వేఁడుకొని మ్రొక్కి వారికట్టు వెళ్ళఁగొనుచు
వలను తెలిసిన మిక్కిలినలరుకొనుచు
వచ్చి యెఱుకులు వేఁటాడఁ జొచ్చిరపుడు.

క. మనువడిన మేకముఁ గొనిచని । తన బ్రొద్దు వెకల్చి నెత్తి గడిగి కటారిం
గొని లోఁకపొడిచి యొకఁడా । ననఁగ సురా లించె నయ్యయా తిక్కఁగడఁక్రన్.

వ. అంత నెఱుకులు కఱకుం బలుకులు చెలంగఁ దెచ్చియార్చిన.

సీ. తొలుత మ్రింగిన కొఱనెలల్ నెలవులందుఁ
గడఁగి వెడలించు నెలదిండి గాములనఁగఁ
గొమ్ము పందులు వెడలె ఘుర్ఘురములదరఁ
బొదలలోనుండి యుప్పడార్పులకుఁ గాక.

క. పొదలట్లు వెడలు పందుల । కడుపులఁ బల్లెములు దిగిచి కవియించిన వె
ల్లిదమైన జాగిలంబులు । చెదరక దాయంగఁ జూచి చెంచులు కడఁకన్.

క. వడి నుసి కొలుపుటయును నిరు । గడలన్ వెఱవంకఁ జేరి కఱువఁగఁగినుకన్
గుడిరొడవఁదిరుగు నెదమం । గుడి దిరుగున్ సాగిపోక గుటగుటలదరన్.

ఉ. అంతట నొక్క చెంచు కఱు నగ్గలికం జని పందిపోటు పై
చెంత దద్దబోవఁ జూచుటయుఁ జిందఱఁ గొమ్ముల నెత్తుఁ [illegible]
రింతలు చెక్కలై పడఁ బయింబడి నొంచెఁ బిడేన దాని క్రొ
వ్వంతయుఁగాఁతి కాఁటియుచటాఱుక నేతనుదోఁగినట్లు గాన్.

ఉ. కుక్కలనొంపఁజూచి మఱికొందఱు కొన్నిటిఁ గొంగ వాలునన్
బక్కలు చించిరన్ గదిసి పైఁబడి కొమ్ములవారినందఱన్
జెక్కలు చేసినంగడల చెంచులు వేఁజము దాల్గఁ బందులన్
బ్రక్కలు వ్రాపి యన్నిటిని వండఁగఁ జెందిన మాడ్కి నుండఁగన్.

చ. ఎదురుగఁ బిట్టువెట్టు కొని యొవ్వరిఁ జేరఁగనీక నల్గడన్
గదిసిన కుక్కలన్ దునుము గద్దఱి పంది నొకండు వెన్నుచే

గీ. అప్పుడుః డివేఁట యిడుమని యానతిచ్చె। రాజు ముంగలికడకుఁ జేరంగవచ్చి
లగుచుసాళ్వంబుడేగలో నుగనుగల్గు । వేఁటపుల్గులు విడిచిన వింటికెగసె.

సీ. కొక్కెరపూరేడు గోజవంకలావుక పొన్నంగి కోవెలకన్నె లేడి
జెళగువ్వ బాతులావిల మానతప్పడుగాఁడు సెకలిపాలకాకిచిలుక
జలితపువెలిచె పావళము తీతువుచిందకక్కెరయేర్కింత కారుకోడి
కాఁజుజెగ్గుఱు నీరుకాకి కంకణముకు కొంగదాబయుకువ్వ వంగపండు
మొదలుగాఁగల్గు వానిని మెదలనీక । కదిసినున్గోళ్ల కొనలను గుదిచిపట్టి
పొదలుచును జేని మదికిసింపొడవఁజేసె। నెలమినప్పుడువిడి వేఁటపులుఁగు వెల్లి.

గీ. అ తనారాచవేలుప్రహోళిరొయటేఁగి । కడిమితోడుతన వ్వేఁటకాంద్రుగడఁగి
పొడపుతైయుండు తెరలెత్తి పోఁగుదీర్చి। బలుమెకంబుల పఁలందుఁబడఁగ నార్చి.

క. పిడుగులపప్పుడు వడువునఁ । గడురొప్పెడు మెకప్రగద్దికలకల్లకకయే
కడలవెడఁంగ యియక । పొడువఁగ నారవలినింగి పోరుకలంగెన్..

శా. రాజ తన్బలుపైన వేఁటతమిచే లాగిల్లి కెంగేలిపై
నేజాద్రిప్పుచు లాగివాగెబలిమిన్ దేయంచు నాక్కున్మడిన్
తేజీదోలిన ముందువెక్కురుగ కెంతేబితలో బ్రుంగి తా
మేజాడ జనఁగా నెలుంగకొదిగెన్ హెచ్చైమెకంబుల్ వెసన్.

వ. ఇట్లుగాలింగేలిగొను నుఱువడి మెఱవడిగారవపు వారువంబు నడలించి
తెరలోనకింగదలించి.

క. పొడిచిన నేజావెంటనె । వడిఁబైకొని చౌకళిచి వచ్చినపులులన్
మెడలెడలించెను బెడిదపు । టడిదంబున నేల గప్పినట్టుగనుండన్.

క. ఆపగిదిద్రేసియుడుగక । యేపునసింగిణికి నారియెక్కించివడిన్
గోపుల బెబ్బులులంగని । తూప్రలసన్నాని నోళ్ళు దోనలుగఁజేసెన్.

మహాస్రగ్ధర. అనుకుం జూపుల్ దగన్ దామడుగులు పుడమిన్ హత్తనీకేగు శేళ్ళన్
గని తేజీఁదోలియంటం గదుముచు మెఱుఁగుల్ గ్రమ్ముచుండంగమున్నె
సిసితూప్రుల్ వెడియొంటం జెలఁగుచుఁదునుకల్ చేసిచేనేర్పుమీఱన్
దనవాలుం గిటికన్నుల్ దలఁపుచు మదిలో దాఁచియున్నట్టికూర్మిన్.

స్రగ్ధర. తుండింపన్ వన్నుబిళ్లన్ దుసిమెఁగణుసులన్ ద్రుంచెఁజిన్వాంగిమూఁకన్
జెంజాడెం గొండగొల్లన్ సెలిగ నెలుఁగులన్ జించెఁగార్ప్రోతులన్ మై-
కంచల్గాఁ జేసె నిల్లన్ గలఁచెఁజిఱుతలన్ గండ్రికల్ చేసినేలన్
నిండించెన్ దుప్పులంబన్నిదముకొకటిన్ లేకయుండంగ నచ్చోన్.

కోయ్యీలును వడిపడిమీఁది కడనడరుచుబెరవుఁగుప్పలై తిప్పతిక్కుంగొప్పలగు చుప్పలకుంగాక జెగ్గలి నేలకుడిగ్గ పెంజిలువలుంబోలె మలలచట్టులమెలకలై జాఱునెలరేఖలును జలువ నెలవులగు కలువరాచ జొచ్చలుపలపై వలపుల్తోఁ బడుకొల్కుల కెలఁకులందగులు మొగిలుతెరల యొరల మఱుంగునం గర్జంగుచు మగువలె బిగువుంగవుంగిళ్ళఁ జొక్కుజక్కవల పెక్కువలును మూరువులై సింగంపుజంగిలికిరవులై విరువులగు నరవలంగరువలి మేపుడుదొరపడగలపై నిగుడు సొంపులగు కెంపులరంగులు తొంగలించి మీఁదికిం బచరించె ననమించు తలిరుబ్రాఁకులునుం గలుగునగ్గుబ్బలి సోయగంపుటుబ్బునకునై నిబ్బరికింప నబ్బురపడియబ్బలియుండు తనలోన.

మత్తకోకిల. నీటిపుట్టుగు పట్టియెన్నఁడు నెమ్మిఁగానఁగ లేనియ
మ్మేటి వెలుపురాయఁడా మరుమేపుకంద్వార మామగా
నేటిసీటుతపంబు చేసెనా యీవడంకమలంచుఁడా
మాటికిన్ గొని యాడుచుంజని మన్నతేఁడటుచుండటన్.

సీ. ఉబ్బుబుగ్గలు గబ్బిగుబ్బలు గాఁగ చిత్తరమైన తరగలు తఱులు గాఁగ
జాలగులోగలుముత్యాలపేరులు గాఁగ మురువగు వెలిదమ్మి మొగము గాఁగఁ
దోరంపుఁదామర తూండ్లు చేతులు గాఁగ నటతేఁటిచాల్పు నూగారు గాఁగఁ
బలులోఁతు సుడియె పొక్కిలి గాఁగ మిక్కిలి కొమరైన ఓందంబు కుతికి గాఁగఁ
గప్పుగల నాఁచు గొప్పైన కొప్పు గాఁగ
మేఁతలిడినంచలిరువంక మూతిగ అవ
రాణఁదులకించు పూఁదీఁగె వీణె గాఁగఁ
బలుకు టెలనాగ యనబోలె నలరి మటియు.

సీ. ఇసుమునఁగావించి యెఱఁగిజాబిలితాల్పుఁదగఁగొల్చు నజ్జదారితటుమం
గాలియోగిరము గాఁగను నీటి లోనఁబదములోన ర్చెడు నిరాబారి గములు
నేచవుల్ మునుమానిలో చూపు గామిన్ను కడలఁదోఁచు వెలుంగుఁగాంచువారుఁ
గ్రుంకి యానీటి కెలంకులందునువన్నె బ్రముగ్గు వెట్టెడు వేల్పు మద్దియలును
బసిఁడి వేఁడెడు వ్రాఁకి కానఁగవచ్చి । దరులఁ గిల్చిన జేజేల దొరలుఁగడల
నడవి పసవులు మెదిచి పైనలఁదుదబసి । కన్నియలపిండు నెంతయుఁ గలుగుదాని.

సీ. తులకించు వేలుపు దొరలకే కొలకూళి పసిఁడి కెందమ్ముల పంట చేను
జుట్టునట్టువ తేజి జోదుఁగాంచినదంట సగరు తెగిననాఁటి చుగితిత్రోవ
వెడిదంపు జడదారి తొడదూటినవలంతి నలువ ఘారువమలు చెలఁగుచోటు

దబమ్ముగావించు జాబాలి దండకరిగి
ముందటికి నేగి సాఁగిలి మ్రొక్కుటయును.

వ. అప్పుడా చప్పుడాలించి.

గీ. అల్లనల్లన కనువిచ్చి యతని వేసి । సోయగంబును వీరంబు చూపు తఱువు
తడవు గాఁజూచి మదిని సంతసము గ్రమ్మ । నపుడు జడదారి రాయఁడిట్లనుచుఁ బలికె.

క. అన్నా నీ పేరెవ్వరు । నిన్నుం గనుఁగొన్న నవపుషునింజూచినయ
ట్లున్నది యారా వేలుపు । గన్నకొమారుఁడవె నీదుకైవడిఁ దోఁచెన్.

చ. అనవిని రాచవేల్పుదొర యాయనఁ గన్గొనికూర్మి నెమ్మదిం
జెనఁగొన నయ్య నేనవపుషు బిడ్డఁడఁ బేరు యయాతి వేఁటకో
పున సవరించినన్ బెరలు బోనలుఁ గైకొనకొక్క యిత్రివ
చ్చినఁ జను దెంచినాఁడ నదిచేపడునో యను హాళితో డుతన్.

వ. అనవుడుఁ జేరువం దపసి యెడఁ బుడమిఱేనిం గూర్చుండ నేమించి గారవించి
యిట్లని యె.

క. రక్కసులు వేదబంబుల । మిక్కిలి నా మునిగొట్టు మిట్టాడంగా
నెక్కటియొక మెకమునకై । యిక్కావల నొంటిఁదిరుగుటిది తగవగునే.

క. మనుపోక రక్కసిమెకమై । తనముందటి కేగుదేర దాని వెనుకఁ బోఁ
జను దెంచి కాదె రాముఁడు । నను వేదుచు మోసపోయి యలజడి పడియెన్.

ఉ. నావుడు నయ్యయాతి మదినాఁటిన ప్రేముడి ముజ్జగంబులన్
బ్రోవఁగఁ గావఁ బీరమునఁ బొల్పగు రాముఁడు నట్టి బాము చే
నేవగ మోసపోయె నతఁడేమిటుఁ దాఁగడ తేతెనా కునో
దేవర యానతీవలయుఁ జేటపడన్ విన వేడుకయ్యెడున్.

వ. అని యడుగుటయును.

చ. అలరఁ బులస్త్యుమద్దుకొడుకైతగు విశ్రవసుండు రావణుం
బెలుచ గుకుంభకర్ణుని విభీషణుఁ గాంచిన వారు మీటి చే
బలువున నెల్లెడల్ గెలిచి పైఁడిదొరం దెగి పాఱఁదోలి ని
చ్చలమునఁ దావిగట్టుకడ సంద్రములో వలిదీవి యేలుచున్.

క. ఎనలేని కడిమి పెంపున । ననిమీఱిన యింద్రజిత్తు నతికాయుని న
త్తునిఁ ద్రిశిరుఁ గాంచె రావణుఁ । డనయంబును జగములెల్ల నలజడిఁ జెందన్.

శా. ఇట్టట్టంబను బోవరాక వగతో నెల్లప్పుడున్ వేలుపుల్
వెట్టింగొట్టము సేయ మత్తిలి వడిన్ విన్నెటి తొల్పున్న యా

గట్టు బిట్టు పెకల్చి రావణుఁడనంగా మీఱి రాకాసి పెన్
బట్టంబేలైన తండు తమ్ముగవఱుప్పట్లన్ దనుంగొల్వఁగన్.

వ. ఇట్లెందును నెదురులేక యతండు లెక్కకు మిక్కిలియగు రక్కసిమూఁకల
ప్రేఁకంబులతో జగంబులు వగలంబొగల నెట్టుకొని కుతిలపెట్టుచు నొక్కనాఁడు.

క. అలనాకయుబలె జేజే । నెలవు పయిన్ దాడి వెట్టు నిగ్గఁదన బంట్లన్
బిలిపించి సొంపు పెంపునఁ। జెలఁగుచుఁ బయనంపుఁ దముకుఁ జేయించుటయున్.

శా. రాలెం జుక్కలు గుబ్బలుల్ వగిలె సంభ్రంబుల్ గలంగెన్ వడిన్
నేలం గుమ్మరిల్లె పారెఁ దిరిగెన్ ప్రేలెన్ వెసన్ బీతు చేఁ
దూలెన్ వేలుపు ఱేని పాఁపనెలవున్ దొడ్డోవెతన్ బొందె వే
జాలిం జెందిరి జేజికంటి దొరయున్ సైరించ కావెన్నుఁడున్.

వ. ఇట్లు తముకు సేయించి కడిమి రక్కసుల పెక్కువల బెడిదంపు నడకంబు దమి గ్రక్క
దలఁగ దలిచని వెండికొండ కెలంకుల మొనలు విడియించెనప్పుడు.

గీ. సరగ మిన్నను కస్తురి సంజ కోకమి । బెట్టుగాఁ గాల్చి బంగారు చుట్టువాలు
పైదను పెట్టఁగఁ గొనిపోయి పట్టు లేక । విడిచెనఁ బ్రొద్దు పడమటి కడలి మున్గె.

క. కడకడలి వేఁడి వెలుఁగను । జడవారి వడిన్ మునుంగఁ జని జేగురుప
చ్చడమూఱఁగ బైదరినఁ । బడమట నెఱసంజ నిండె బలుపుగ మఱియున్.

సీ. పూనికఁ దగు పేటి తేంపసిండి యుప్పరిగ వాకిటి తోఁపు తెరయనంగఁ
గ్రుంకు మెట్టున వేల్పుఁ గొమ్మలాడుచుఁ జల్లఁ దులకించు చెంద్రపు దుమ్మనంగఁ
గడుసొంపు చేనొప్పు పడమటి మలమీఁది చఱులందుఁ గెంపుల చాయలనఁగఁ
దమినాడు తెఱగంటికొమరులు గావింపఁ బోలు పాంసుపగడంపుఁ బలుకయనఁగఁ
ప్రొద్దువాసెనవంతలోఁ బాడముచుఁ డా। మఱుఁగు కెందమ్మి రేకుల మూకయనఁగ
విరియు చెంగావననలకు వెన్నపెట్టి । నిండె నెఱసంజ కన్నుల పండువగుచు.

వ. అప్పుడు.

సీ. నింగి పేరింటి మున్నీటిలో నప్పుడ పొడమిన బెడిదంపు బుగ్గలనఁగ
నాకసంబను ప్రమానియందు నొక్కమ్మడిఁ బూచిన తెల్లి చాయ పువ్వులనఁగ
మిన్ననుకొల్లనిలో మెఱుఁగెక్కి విరియుచు జిగినుల్లసిల్లెడు తొగలనంగఁ
జదలను నల్ల పచ్చడము పైఁబచరింపఁ దిలకించు నాణెముత్తెములనఁగఁ
గదిసి వలరాచ మేపుడుఁ గంటి వేల్పు । జడలలోనుండి వడియుచుఁ గడితపడిన
తేటవేలుపుఁ బేటి పెన్నీటి బొట్టు । లనఁగఁ జుక్కలు గనుపట్టె నలుదెలివి.

చ. తలఁప ననుంగులైన యలతమ్ములలోఁ బలడాఁగెఁ గాక తా
వెలికెట కేఁగఁగాఁగలఁడు వేఁడి వెలుంగని పేర్చియార్చుచున్
సెలుఁగులఁబట్టఁగా వెదకు చీఁకటి సోఁకుడు పిల్లలో యనన్
గొలఁకులఁ ద్రిమ్మరం దొడఁగెఁ గూర్కు క్రమ్మయుచు గండుఁదుమ్మెదల్.

క. తమ్ములు మొగిడించినఁ దమ । కొమ్మలలోఁ జిక్కి నిక్కి కూరిమిఁ జుట్టున్
ద్రిమ్మరు మగతుమ్మెదలా । నెమ్మది వగ గాక యున్నె నెలఁత లఁబాయన్.

క. ఇరులు బలియుచు వలఁకుల్ । కరమరుదై కరుకు కట్టి కదిసిన కరణిన్
బరఁగఁగఁ దోఁచుడుఁ గాటుక । కరవటముం బోలె నిజ్జగంబు దనర్చెన్.

గీ. పూని పదిరెండు ప్రొద్దులుఁ బాడి చెనేని । యింపులోఁ గానవచ్చునె యించుకైన
ననఁగఁ గలిగిన వన్నియ లలమి తఁదు । రూపు గామింటి చీఁకటి యేపు చూపె.

గీ. తనకుఁ బగయగు ప్రొద్దు వెనక కనక
కనలు చీఁకటి రక్కసికన్నులందుఁ
దోఁచుఁ గుకణకణమను నిప్పుఁ గనుకలనఁగ
మోలిచె నెడనెడ మిణుఁగురుఁబుర్వులంత.

క. వెలిచాయ దోఁచె మూపు । వలనం దగఁ దమ్మి విరులు వాతుల మూయన్
నె చూలన వెలవెలనగు । తొలుకడయను నెలఁత మొగము తోరపుఁ జిగిగాన్.

క. కరముల రేఁడూగ్పు మలఁజెం । దురఁడా వట నిర్గసోఁకుఁ దనుమంటకై వే
గరమూళ సప్రంగతిదే । వర పంపిన కే పుఁజుట్టువాలుం బోలెన్.

గీ. కీడె యుక్కుసహాత్రించి విన్ననాఁగ । వలులు వెన్నుని గొలువంగ వచ్చు చివ్వ
కూటితవి సియు బలెఁ గందుగొనబు మీఁద । నందురుండల్లనల్లనఁ జదలఁ బ్రాఁకె.

క. ఆతతి వెన్నెల దగు మ । జ్జాతా జాబిల్లి వెజ్జ జగమున కెల్లన్
శాతిరి సోఁకిన చీఁకటి । బూతము విడువంగఁ జల్లు బూతియుఁ బోలెన్.

సీ. వెల్పురాయఁడు దన వెలినావుఁ బెలిగోరు సిగి ద్రూఁకులఁ గాన కెడఁగలంగఁ
గటిమేని కప్పార పాలకడలిఁ జిల్వల తేనిఁ దెలిదీవిఁ గన తేకతిరుగుచుండ
ముక్కంటి వలిగట్టు నిక్కమెట్టును నాల పోతుఁ గానక చాల బీతు కుడువ
వలు మొగంబుల మేటి పలుకుఁ దొయ్యలి నంచ వెలిమేని కొమకును వెదకఁ బోవ
నన్నిరంగుల తొనరంగులై తలిర్ప । నిగిడి తెలిచాయ వెల్లి రాయనిం డె ననఁగ
నిక్కజగముల నెల్లను చిక్కటిల్లి । నిలిపి పొంగుచుఁ బండు వెన్నెల దనర్చెం

వ. అప్పుడు.

సీ. అనుకువ వెన్నెలఁ జాల్చి తునిచి సేవెలు చేసి వెన్నెలపాలను జున్నొనర్చి
గట్టివెన్నెలపిండిగొట్టి వెన్నెలవెన్న గలయవెన్నప్పాలుగా నమర్చి
గడితంపువెన్నెల గంద్రికల్ సిగరిగాఁడియ్య వెన్నెలలోనఁ దెచ్చిపెట్టి
యొడలవెన్నెల చక్కెరిడిజోన్కు వెన్నెలఁబూనికనాళిలుగానుగూర్చి
పండువెన్నెలయను వెండిపళ్లెరములఁ। జెలఁగి యుల్లాగ్రమువడ్డింపఁ జెలువుఁ దామ
వేడుకలుమీఱ బువ్వంపుఁగూడుగుడిచి। పొదలుతమితోడ వెన్నెలపువుఁగుఱమరె

వ. అప్పుడు.

క. బలునైన రైన్నవి గూర్పఁగఁ। బాలివోవని తేఁతపాయసపుం బాగరులతోఁ
దలిమము లెక్కిడి వెన్నెల। పులుఁగులఁగని తనదుమనని బాదలువిరాలిన్.

వ. వలరాజు పూఁదూపుల కులికి వేలంబు వెలికింజని రావణుండు ద్రిమ్మరునట్టియెడ.

సీ. కస్తూరి మొదలుగాఁగ లపంబుచేసిన గంధంబునను పూఁత గాఁగఁ బూని
వెన్నెలపారవంటి పెలిపట్టువలిపంబు జిలుఁగుఁ బావడమీఁద నలవరించి
వేలుడుగాఁ దీర్చి కీలుగంటునఁ గ్రొత్త చతుపకఁబులసరుల్ పెనఁచి చుట్టి
పసిమినువ్వింగు మట్టుసవ్రసొమ్ములతోడ నాణిముత్తెపుఁ బేరులను వుపటించి
యందియలమ్రోఁత చెవులకు విందుసేయఁ
జదలనెకసక్కెమాడెడు సన్నగొను
బిగువుఁ జన్నులవ్రేఁగున జెగడుగుడువ
మరుఁడుదోడుగఁ జనుదెంచు మగువఁ గాంచి.

గీ. వడివడింజని పట్టి యోవాలుగంటి। నీదు పేరేమి యెవ్వఁడు నీమనుగఁడు
పూని కాందారిమాందారి ప్రొద్దుకడను। నెందువోయెదు తలిదండ్రులెవ్వరనిన.

ఉ. రక్కసిరాయ యేమనుము రంభను మిక్కిలి నన్పుకత్తెనై
జక్కులతేఁపట్టిదని జవ్వనమంతయు జన్నెగట్టి రే
యెక్కటెనుండ లేక తన యొద్దికిఁ బోవుచునున్న దాననే
నక్కడలిన్ దగంగలుగు టందఱు విన్నదె చెప్ప నేటికిన్.

క. తడవయ్యెనాకుఁ బోవలె। విడవయ్యతలంపు లోరుల వెలయాండ్రపయిన్
బడిపట్టఁ దగవుగాదిది। సడిసేగియు వచ్చు వేల్పుసామికి నైన్నన్.

గీ. అనుడు రక్కసిరాయఁడోయతివ జగము। లన్నియును బంపుసేయంగనున్న నన్ను
రావణునిగా నెఱుంగవో నీవుతమిని। నెఱిఁగితేని యుఁబలుకఁ దేయుత్తెఱఁగున.

క. సిరిరామోఁకాలొడ్డిన। కరణిన్ దైకొనుచు నేనకదియఁగననునీ
వెరవుగపటనాడుచునాక। తిరిపెపుఁ జెలిపట్టిఁ జేరఁదివిరెద వేమీ.

వ. అనిష్టలికి తలంప్రనిలుపనోపక పయింబడం దమకించు నతని తలం బెట్టించి రక్క-
సునకది యిట్లనియె.

ఉ. కోడిగమేటికయ్య నలకూబరుఁ బంటిన వాఁడఁ గాన నేఁ
గోడలనీకునావుడును గొంచకయాతఁడు కూర్మి హెచ్చఁగాఁ
జేడియ యేటిమాటలివి చెల్లునటే వెలయాలికిచ్చటన్
జాడియువావియున్ గలదె పల్కు-కుమట్లనుగాక వెండియున్.

క. వెలయాలుఁ జెలువుఁ జెరువున్ । జలిపందిరి యొకరిసొమ్మె సమకూర్చి మదిన్
దలపోసి చూచి తెలిసినఁ । దలిరాకుం బోఁడి యింకఁ దరితీపేలా.

వ. అనిపలికిన.

గీ. బలిమిఁ బైఁబడి వలరాచ పనియొనర్చి । విడిచి రక్కసిదొరపోయె వేలమునకుఁ
దన్మికంటియు నాతండు తగవు దొఱఁగి । తన్నుఁ జేసిన చేఁతకుఁ దలఁకుమదిని.

సీ. బలిమితో బిగ్గరఁ బదినోళ్ల నానఁ గాసొంపఱుజిగి మోవి కెంపుతోడఁ
సెలగ చేతుల గోళ్లఁ జీర నెత్తుటఁ దోఁగి సజ్జనజ్జైన చన్నులలతోడఁ
గదిసి మైకొందంగఁ గాఁగిట బిగియింపఁ జొక్కు-ళ్లు వోయిన సొమ్ము తోడ
మొనసిన తమిఁ బోఁకముడి దివ్వఁ బెనఁగఁగాఁ జినిఁగి వనుఁ జల్వ చేలతోడ
నోపికెలుఁగక తనలావు చూపికలయ । బడలియదవదయైయున్న యుడలితోడఁ
గాఁక నీడ్చిన విడిన కీల్గంటుతోడ । వచ్చె నలకూబరుం జున్న వలనికతివ.

క. వచ్చి తన యనుగులం బడి । యచ్చరపూఁబోఁడి వానికంతయుఁ జెప్పన్
హెచ్చుగుచుఁ గినుక మదిలోఁ । బిచ్చిలనప్పుడి తేని బిడ్డఁడు గడిమిన్.

క. ఇది మొదలుగాఁగ బలిమిన్ । ముదితలఁ దాఁబట్టెనేని ముదితలలు వడిన్
బడి వగిలిపోలియుఁ గాకని । యదరుచు రావణుఁ గూర్చి యలుకం బలికెన్.

వ. అంత.

చ. పొదలెడు నట్టి చుక్కలను పువ్వులు జాలని దుర్పనొప్పన
ప్పుదలను సజ్జ రేయనెడు జాణయుఁ దాఁ దెలిరంగు గంద మొ
ప్పిదమగుఁ జిట్లుఁ గాఁ బెనఁగి పెట్టుగు నాయలఁ తన్ గలంగుచున్
నిసురకుఁ బోలెఁ గ్రుంకుమల నెత్తము చేరెను జందురుం డొగిన్.

క. తెలియపుడు నిగిడిమగుడన్ । జిగిరించిన పగటిపేరి చెట్టును బోలెన్
దగవదగపు నిగ్గుద్ద కెంపునఁ । దగి సంజదనర్చె మింగులఁ జారొ్కనుతెలిపిన్.

సీ. అరయ వెన్నుఁడె దేవరని వేల్పు గమిచాటఁ గానెత్తు పైఁడి జేగంటయనఁగఁ
దాలుకదకబలిలోఁ దిలకించు సిరిగేస్తునకుఁ గైనఁ దగు నీటి యుక్కు-యునఁగ

జేజేలఁగాయని తేజీతలాటమై పరఁగెడు పికిలి పూబంతియనఁగఁ
మూరుపునాఁడేలు దొరపట్టిసీటుతోఁ గేలఁబూనిన కెంపు కేడెమనఁగ
నిట్టపట్టుగఁగ్రేఁచని నెట్టెముననుఁ సొంపుచేనొప్పు తామర కెంపువనంగ
మొదలిమాఁవ్వార తేజముపెన్నద్దమైన । ప్రొద్దు కెంజాయ నెంతయుఁ బాడమియొప్పె

వ. అట్టియెడ రావణుండు.

సీ. చనియుంగలమువేఁడి చల్లార్చి యల్కతో జమునిబీరముల్లఁ జక్కఁ బెట్టి
కొలమువాఁగెమున నప్పులసుదిండిని నల్పి తెగినీటిజేని పెంపిగురఁజేసి
గాడుపు నెందేని కదలిపోఁదూలించి యలకనేలెడువాని కలిమినాఁచి
కిరీటాబిలికొల్చుఁదిరిపంబుగావించి వేల్పురాయని సొంపు క్రొవ్వు గెల్చి
బలువు చేవారి నెలవులు పాడుచేసి । చెలఁగి జేజేల కొమ్మలఁ జెఱలు వట్టి
కలననెదిరింప నెవ్వరిఁగాన కపుడు । కదలెఁదనదీవికలరి రక్కసులఱేఁడు.

ఆ. ఈకరణిఁ బదిమొగములఁ । రాకాసియెనర్చినట్టి రాయిడి చేతన్
జీకాకగుచును వేల్పు । లాకటిదేవరకు నుడువనరుగుచు నెదుటన్.

సీ. కరువలినెగయుతుంపురుల మున్నురమెల్లఁ గ్రమ్మెడు పుప్పొళ్లదుమ్ము గాఁగఁ
గొరమూపైఁ గదలెడు తరగల మొత్తముల్ సమకొన్నకొమ్మల గములు గాఁగఁ
దనలోన నెలమిని దరిఁజేరియున్న ముత్యాలెల్లఁ దెలిచాయ పూలు గాఁగ
గొప్పలై వెన్నెల కుప్పలో యననొప్పు బలితంపు నురుగులు పండ్లు గాఁగ
జాలుకొను తెల్లరంగునఁ జాగిమాను । చెలువుమీఱుచు వేల్పుఁ జెట్టువోలెఁ
బరఁగియెంతయు నుప్పొంగు పాఁకడలిఁ । జేరి పలుమాఱుమది సంతసిలుచు నందుఁ.

సీ. జగములు గలిగింపఁజాలు నల్వఁ బుట్టించిన పొక్కిలి తమ్మివానిఁ
దొలుకారు మొగులు పైనలుసుమించిన మేనఁగడు నొప్పు పసిఁడి పచ్చడమువానిఁ
గలిమిదేవేరి నక్కలికితోఁ బుట్టిన కెంపు నక్కునఁ దాల్చు సొంపువానిఁ
గొలువవచ్చిన ప్రొద్దు నెలయునాఁ జేదోయిఁ జుట్టలుగ జిందంబు సొగయువాని
నాలిఁగన్న య్యాఁదనయంపకోలముల్కఁ । గట్టకడ నొంచి మించిన కడిమివానిఁ
బ్రాఁత చదువుఁ తుదల నేర్పడుచు నొప్పు । నతకగలవానిఁ దమ బారినడఁచువాని

చ. చిలువలతేనిపైయెసెడు సెజ్జను మించిన మంచుఁగొండపై
నలిఁబొలుపొందు కార్మొగులు నాఁదగు చామనమేనినిద్దపు
జెలువున మీఱుకుందనపుఁ జేలమెఱుంగున నొప్పువెన్నునిం
గలమల చాన గేస్తుఁగని కన్నులనీరొలుకంగ మ్రొక్కుచున్.

వ. పలుదెఱంగులం బొగడి వగలుమిగుల నాగిలి పొగులుచు నెఱుంగురాలు పడి వేలుపులిట్లనిరి.

ఉ. కంటికి నెప్పుడుం దమనఁ గైకొని జేసిర ప్రోవ నిన్ని నా
ళ్ళంటిమి గాక మీరు మదినా పరికించిన నాకు పూఁటయున్
మంటిమె యొండుచోటు మఱిమాకును గల్గునొ చూచి మా సిరుల్
గెంటక యుండఁగావు మఱిఁగీల్కొను ప్రేమ శివమ్ము నందఱన్.

సీ. మునిసికఱకటి వేళ్ళకును బెల్లగిల్లఁ గాఁబడుకు ప్రక్కలు నేఁబడఁగఁ ద్రోచి
వాడవాతలఁ గెంపు మేడ తెల్ల తుజాల మొదలి వట్టుగలంగఁ జదియఁ దాఁచి
యంగళ్ళ తావుల తెఱంగి రాకుండంగ బంగారు దోడల రంగుఁ జేఱిచి
నెలజాలఁ దీరిన యలమాళిగలలోని మేలి మచ్చులు క్రీలఁ గూలనూకి
యంతఁ బోవక సోఁకు నూవంతు తెచి । కొలువ జేజేలరాయని కొలువు మేడ
పై జయంతంబు ప్రథమి పై బ్రాల ద్రొబ్బె । నగ్గువగ్గగ నతని యేనుఁగులు వేసి.

సీ. ఉలుపచాల వటంచు నలుగు వేలుపు తేని వంట గాదని యగ్గినంటఁగట్టుఁ
బాలసుడేఁడని వేఁడి వెలుఁగుపట్టిని గొట్టుఁగని కొల్వఁడనుచు రక్కసునిన్నొంచు.
నీళ్ళు వల్లఁదటంచు నీటి తేనిఁగలంచుఁ గడు పీచితని గాలి గాసిఁబెట్టు
నదలించుఁగానుక కై పైఁడిరాయనిఁ గడకొత్తి ముక్కంటి జడలు పెఱుకు
సరగ వరుపుడుఁ బనులకు చ్చరలఁ బనుచు । నేమి చెప్పుదుమయ్య మాయిడుమపాటు
తలఁచుకొన్నను గుండియల్ తల్లడిల్లు । జియ్యయుఁ కనైనఁ బ్రోవ వేఁచిత్తగించి.

వ. అని వగచి పలుకు వేలుపులమాటలాలించి వారికి వెన్నుండిట్లనియె.

చ. వెఱవకుఁడయ్య రక్కసుఁడు సేమముఁ బెట్టిన బాము లెల్ల నే
నెఱుఁగనె వానికిన్నలువ యిచ్చిన మాట దలంచి దానికిన్
దఱియగునంతకున్ మది నిటాలిత నిప్పని వేగఁదీర్తు నే
మఱిఁ జనుఁడన్న వారు వగమానుచు వచ్చిరి చొక్కిపట్లకున్.

గీ. అంతఁ బ్రొద్దుకోలంబున నలరు మేటి । దశరథుఁడు పెండ్లియయ్యెను దగిన సొంపు
మెఱయఁ గౌసల్య కైక సుమిత్రయనఁగ । వాలసిరి యొప్పెడు ముప్వరు తలిరుబోండ్ల

వ. అంత.

గీ. తమ్మిపొక్కిటి వేలుపు దశరథునకు । నలరు కౌసల్యకును రాముఁడన గఁబుట్టెఁ
గైకభరతుఁ సుమిత్రకు లక్ష్మణుండును జాలఁ । గడిమిమించిన శత్రుఘ్నుఁ గాంచిరలరి.

సీ. ఎలమి నప్పువ్వుఁబోండ్లకు నిట్లుగలిగి
రాముఁడన లక్ష్మణుండన రమణి భరతుఁ

డనఁగా శత్రుఘ్నుఁడనఁగ నెయ్యమున మెఱసి
యిద్దఱిద్దఱు కవగూడి యెనసి రెప్పుడు.

వ. ఇట్లుగూర్మి కందుపొందెఱుంగని విదియఁ జందురుని యందంబున నానాటికి
నీటుగలిగి పెరుగుచు.

క. నెలప్రాఁదాలుపుపగిదిన్ । విలునేర్పున సాటిలేక వెలయుకొమరులన్
లలిఁజూచి పొంగు దశరథు । కొలువునకరుదెంచె గాధికొడుకొకడంకన్.

చ. వెరవునలావునన్ గడిమి బీరమునన్ బొలుపొందురాచఁదే
వరమెఱయంగ నేర్చిన కువాళపుమన్నియ మూఁక నేలతో
న్వరి బలుగొడ్డు తమ్మిచెలిపట్టిని సంద్రము వేల్పుమ్రానిఁ జం
దురు బలిఁ జాగపున్ మొదవునన్ నరిపించిన యాగినేర్పరీ.

క. కలుములకుఁ బేరయసగెలు । పుల వేలుపు రాకొమార పుడమిన్ మెయితో
మెలఁగు వలరాయ పలుకుల । చిలువలరాయా దురంపు నెకకస్సటీ.

మాలిని. కలుములచెలి చాలంగైపుతోఁ బాలవెల్లిన్
గలిగి చెలఁగుచున్ జాగంబుతో మించుతేఁన్
వెలయఁగొలములోనన్ బీరమున్ లావు మీఱన్
గలిగి పొలుచునైతోఁ గమ్మవిల్కాని మేటి.

గద్య. ఇది శ్రీమదనగోపాల మంత్రప్రసాద లబ్ధసారస్వత సుకవిజనవర్ణనీయ వచో
విభవ భావనామాత్య తనూభవ పొన్నికంటివంశవర్య తెలగనార్య ప్రణీతంబైన
యయాతిచరిత్రంబను నచ్చ తెనుఁగుఁ గబ్బంబునందు ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము.

క. సిరిగుబ్బ చెన్నుఁగొండల । దరులగతి మొగులుపగిదిఁ దవిలి తిరుగున
మ్మరుతండ్రి మనుపున సమాల । నెరయున మీర్ ఖాన సింగిణీసుల్తానా.

వ. అటమీఁది తెఱంగు వినుండు.

గీ. ఇట్లువచ్చిన జడదారి కెదురుగాఁగ । నరిగి సాఁగిలి మ్రొక్కి తానతఁడొసం
నట్టిదీవనఁ గైకొని యలరితవిసి । నపుడు బంగరుగద్దియ యందు నునిచి.

క. అడుగుందమ్ములుగూరిమిఁ । గడిగితగం గారవించి కరమలరుచుని
ప్పుడువచ్చిన పనియేమని । యడిగిన రాతపసిఁజూచి యాయన్నతోడన్.

క. విన్ననిమాటలరాపై । యెన్నఁగఁదగిన ట్రిరాము నెఁకఁ బాయమున్నం
బిన్ననిచూడక యెటినా । జన్నముఁ గావంగఁబనుపఁ జనునని పలుకన్.

క. దండకమను కానకుఁజని । యుండఁగ రావణుని చెలియ యొగ్గిగలయుక్తై
దండకు రాక్షసుఁడది । మండాఁగ ముక్కు చెవుల మనుకువ మాన్చెన్.

ఉ. గాసిలు దాని సూఁడుసకుఁగాఁ త్రిశిరుండు ఖరుండు దూషణుం
డీసున రాఁగ వారినని నేపఱఁద్రుంచిన రావణుండు దా
జేసియుసుంగు రక్కసుల జేఁబసిండి మెకంబు రూపుగాఁ
జేసి యలంపఁ బంపుటయు సీత కనుంగొని దానిఁ దెమ్మనన్.

ఉ. తమ్ముని నాలిఁ గావనిడి దానిబడి జని వేడబంబు చె
య్యిమ్ములఁగాన లేక యలయించుచుఁ బోవఁగఁ గిన్కతోఁడఁ దా
నమ్మి వేసి యేయుటయు నా మెక మప్పుడు ద్రెళ్ళుచుండి యో
తమ్ముఁడ లక్ష్మణా యన నెదం గుర పిల్లుచు సీత పంపినన్.

గీ. ఒరుల పనియేమి జేజేల దొంగలైనఁ । బాపము కడిమిని గలని లోఁ బొలియఁజేయ
నన్న బలిమి యెఱిఁగియును తెలియ మాట । కులికి తమ్ముఁడంతం త నాద్దిశేఁగ.

క. అతనిఁ గనుఁగొని రాముం । డో తమ్ముఁడ నేల చూలి నొక్క తె డిఱ
య్యోతె తఱియని దూఱుచు । నా తెగిం మెగంబుఁ గొనుచు నరుదేంతన్.

సీ. జడదారియై వచ్చి తడయక రావణుం డతివఁ గొంపోయిన నాకు టెంబుఁ
గొమ్మఁ గానక కానఁ ద్రిమ్మరి రాముండు లక్ష్మణుండడవి నోలముల వెదకి
పనవఁగా సీతను గొంపోవు రక్కసుఁ గని పోరి మడిసీన కడిఁది ప్రలుఁగు
నకుఁ దగినట్టి చందము దీర్చి యరుగుచుఁ బంపచేరువ గాలిపట్టిఁ గాంచి
యతఁడు దెలుపంగ సుగ్రీవునలరఁ జేసి। తమ్ముఁ గొలిపించుకొని వని నాయమైన
వాలిఁ దునుమాడి మఱితన వాఁడననిన । యంగదుని నిల్పి కొన్నినాళ్ళ చటనుండి.

గీ. నేల చ్యాలి వెద్కి గాలిబిడ్డఁడు లోను । గానుగలిగి నట్టి కడి దిక్కొమ్మ
మెకపు గమ్ముల నను పమించి యుండు ఱిలోన । ననుమఁ దుప్పుకడలి యవలికరిగి.

గీ. సీతఁ గాంచి యల్లఁ జేరి యూరడెవేలు । పానవాలుగాఁ గనని పినట్టి
యుంగరంబొసంగి యువిదనెమ్మదిలోని । వగపుకొంతకొంత నాగులఁ జేసి.

వ. అట్లు రాముండనిపిన యానవాలిచ్చి యచ్చెలు వంగనినయుబ్బునం గొబ్బున
బొంగి సింగారపుఁ దోఁటలోను గాఁ దోఁపులు వెకలించి కాపులున్న రక్కసుల
నెక్కసంబుగా నొక్కమ్మడి నక్షుఁడు మొదలుగాఁ బలువురఁ బొలసు మేపరు-
జముని నెలవునకనిచి పెనఁకువఁ బట్టువడ జెట్టు వేడుకపడు గాడు ప్రవట్టి మీఁద
రాకాసి మొనలు గనలి.

క. పట్టుకొని కట్టి రావణు । కట్టైనుటను బెట్టి తోఁకఁ గ్రిందుగఁ గోకల్
చుట్టించి యింగలంబున । ముట్టించిన ననుమఁ డలిగి మొగమిగురింపన్.

క. ఉలికి పక్షియు తని పీటం । గాలతాపుడి సెల్లఁ గలయఁగాఁ ద్రిమ్మరికో
వెలచాయఁ జేసె మిక్కిలి । యబరుచుఁ బలుమాఱు ద్రుళ్లి నాఁడుచుఁగినుకన్.

వ. ఇట్లు గాసించి యక్కలువలి పట్టి క్రమ్మఱి యక్కొమ్మ చేతి గుఱుతు గొని వచ్చి యుద్ధియు స్సుద్ధి యుద్ధఁడి నెఱింగించిన బొంగి రాముండతనిఁ గౌఁగిటం జేర్చి గారవించి యుడుగర లిచ్చె యనిచిన పిమ్మట వేఁడి వెలుంగు ననుంగుఁ జూలించి లిపించి కడలి దాఁటి చనవలయుం జాటింపుమనవుడు నతఁడట్లు చేసిన మఱునాఁడు.

ఉ. కొమ్మ మెకంపు వెల్లువలు గొల్వఁగ వేగిర మేగుదెంచి సం
భ్రిమ్ముకడం దగన్విడిసి రావణుతమ్ముఁడు చేరవచ్చినన్
రమ్మని వానికిమ్ము సుపెరక్కసి పట్టము సంగి యేటిరేఁ
డ మ్మెఱఁ ద్రోవ రాయు మది నల్గుచుఁ దావిలు కేలఁ బూనుచున్.

క. కడు నలిగి ప్రఁడిసిలించియు । బడలింపఁగ లేని కడనపట్టి రయో మఱి వా
బెడిదపుఁ దూపని నారిం । దొడిగిన బలు చిలుకుఁజూచి తొలఁకుటుడుగుచున్.

క. అప్పుడు చూచిన నేమని । చెప్పుదు నక్కడలి కాకి చిప్పలు నీనుముల్
గుప్పలు దెప్పలు తిప్పలు । కప్పలు చిక్కంగ దుమ్ము గ్రమ్ముచునుండెన్.

గీ. కడలి యప్పుడొడలు గైకొని చనుదెంచి । కడిఁది మ్రానికములు కానుకిచ్చి
తప్పు చేసినాఁడఁ దగఁ బ్రోవుమని రాము । నడుగుఁదమ్ములందుఁ బడి వడఁకుచు.

వ. తొలుమిసుకులకడలనుం గానరాని యాతెన్నింబులు దెఱంగులం బొగడి.

ఉ. తెన్నన కేను గాదనను దేవర మీయసమిజ్జగంబునం
దెన్నటికిం దిరంబగుచు నెన్నిక కెక్కుచు నిల్చునట్టుగా
దిన్నఁగఁ గట్టఁగట్టుఁ జను దెమ్మనినన్ సిరిగన్నతండ్రిఁ దా
మన్ననఁ జేసి పంపి తనమంది నుంగొని రాముఁడిట్లనున్.

క. మనవాఁ డైనసుగ్రీవుఁడు చె । ప్పినమాటలు వింటిరింకఁ బిలుతివకమలల్
గొనివచ్చి కట్టకట్టుఁడు । చనవలయున్ గడలిదాఁటి సరగున మనకున్.

సీ. నెలతాల్పు దేవర యలిగినఁ బని గాదు వెండిగుబ్బలి దేక యుండనిండు
నేల గ్రక్కున గ్రుంగ నిల్వ రాదేరికిఁ దెగియేడుకొండలు దివకరండు
నలి రేయుఁ బగలును నడక గానఁగరాదు పుట్టుగ్రుంకుడు గట్లు పెట్టిరండు
వేవల్లె లెంకులఁ దివియుట గారాను లలిఁ బేఁడిమూలదేక నిలిపిరండు

మఱియుఁ జడుపేరుగలిగిన మలలనరసి । యున్నతావులు గదలింపకున్న చిరంజు
మీరలంచును బిలిచి నేమించి తనుప । గిరిగిశొమ్మమేకంబులు నట్లచేసె.

గీ. పేదకి మఱికల్లుమలెల్లఁ గదియఁజేర్చి । కట్టఁగట్టినఁ గౌసల్యపట్టిమల్లు
వెల్లువలమున్న నడిపించి వెనుకఁగదలి । తమ్ముఁడును దాను మున్నీరు దాఁటియవల.

వ. వేలంబు విడియించి మిడిమేళంబుగా నాలంబునకు వెడలు రక్కసి యొడయని బెడిదంబునకోర్చి యతని ప్రేకంబులయిన మూఁకల నేలంగూల్చి యంత.

సీ. అనిలోన మార్కొన్న యతికాయుఁ జంపించి కడిమి విద్యుజ్జిహ్వుఁ బడఁగవైచి
ఖడ్గరోముని మేను కడికండలుగఁ జేసి పేర్మి విరూపాక్షుఁ జేరి తండిచి
యింద్రజిత్తును జమునింటికి నిపించి కుంభకర్ణుని నేలఁ గూలనేసి
బలగంబుతోఁ గూడ బలియు రావణుఁ ద్రుంచి మఱియు రక్కసుల నందఱను ద్రుంచి
పిల్చి రాకాసి ప్రోలు విభీషణునకుఁ । దిరముగా నిచ్చి సెకబాసఁ జేతఁబట్టి
చాలు పేరింటి పూఁబోఁడి నోలిఁ గూడి । తానుఁ దమ్ముఁడుఁ దగ నయోధ్యకును వచ్చె.

గీ. ఇట్లు వచ్చి రాముఁ డెల్లు తేనిబ్బొద్దు । చూలిగాఁడు పట్టి వాలిబిడ్డ
య్యును విభీషణుండు మొదలైనవారలఁ । గోర్కులొసఁగి యనిపెఁ బేర్కొనఁగ.

వ. ఇప్పగిదిననిచి రాముండు కడలేని సిరులు దొడరి కడలి కడగాఁగల పుడమి తనపేరి
నిది కనువినుకలి నెలవు పుట్టు చేవిరివిగాఁ జెప్పంబడి జగంబు లెఱిఁగినదగు ట్లుం జేసి
నీకుం గొంచెంబుగాఁ జెప్పితి నట్లగుట మీవంటి వారికి నాంటినదవినద తేరం జన్నదని
యజ్జడదారి గారవించి పంచిన నయ్యయాతి మగిడి కాఱడవిలోఁ జనుదెంచు
నప్పుడు దప్పిగొని నలుగడలుం బరికించి.

క. తనదండ ద్రిమ్మరుకులుక లో । మును గట్టిన ఱాలసంది మొలచిన చెట్టుం
జెనఁగొన చీర్కట్టి గ్రమ్మం । గనఁదగు నొకపాదు నూయి గనుఁగొనియంతన్.

సీ. మాటమాటైయల్లి మఱుఁగుమైడాఁగిన నీటి రాయని కూర్మి నెలఁతయనఁగఁ
నామంతోడి సయ్యాటకై యచ్చోటి కరుగుదెంచిన కానసిరియనఁగ
జిలువకన్నియలతోఁ జెలిమిఁగావింపఁగా వచ్చినవలరాచ లచ్చియనఁగ
నడవి సోయగమున కబ్బురమంది కన్గొనఁగఁ జేరిన పాఁపకొమ్మయనఁగ
ననుఁగుఁ జెలినిబోలె నలరుఁ దీవియనూఁది । నిగుడుమనములోని నెగులు చేతఁ
జప్పుడేమియైన సరగనాలించుచు । నున్నదానినొక్కయువిద్దఁ గాంచి.

వ. వెఱఁగుపడి వారువంబుడిగ్గి చేరంజనుదెంచిన నయ్యయాతింగని మున్నెఱిఁగినది
గాన మదిలోన్నఁ బొంగునడ్డలు నిలుపలేక.

క. వలిపెంబు దెఱఁగు మోమున । నెలఁ జేసిన మంచుపగిది నెఱయం గాఁగో
వెలక్రోల్చు చందమున నా । యెలనాగ కలంగి పెద్ద యెలుఁగున నేడ్చెన్.

వ. ఇట్లు తెగినగాము నమ్మగువం గనుంగొని మది గరంగం గదియవచ్చి.

చ. అడలున నెంతయుం గలఁగి యగ్గలికం గుడిచేయి సాఁచి మై
వడఁకెడు కొమ్మ కేలు చెలువంబుగఁ బట్టి యయాతి నూతిలో
వెడలిచి యప్పుడమ్మగువ వేనలి కన్నులు మోము చెక్కులున్
మెడ చనుదోయి నెన్నడుము మేను పిఱుందును గాంచి వేడుకన్.

క. కరమరుదుగ్గ నవ్వాలఁతుక । గరగరికకు వెఱఁగుపడుచుఁ గలికి నీవె
వ్వరిదాన విందులో నే । కరణిం బడవలసెఁ జెప్పుము కల తెఱఁగు సుదతిన్.

క. తను వెదకవచ్చియట ని । ల్చిన ఘూర్ణిక యనెడుదానిఁ జెలికత్తియఁ గ
న్గొనదియ త్తెఱఁగెల్లను । మును సెలుఁగుటఁ జేసి రాచముక్కంటి విద్వారన్.

చ. కనుఁగొని నెమ్మది న్నెగులు గ్రమ్మఁ గరక్కసి యొజ్జయుంచుఁ బే
ర్కొనఁదగు నట్టి శుక్రునకుఁ గూరిమి కూఁతురు దేవయాన నాఁ
దనరిన యిన్నెలంత నాక తప్పున కై వృషపర్వుపట్టి నూ
తనుబడఁ ద్రోచిపోయె నని దాని తెఱంగది విన్నవించినన్.

గీ. అతివ వృషపర్వుఁడన నెవ్వఁ డతని యనుఁగుఁ
గూఁతు పేరేమి తనుఁబట్టి నూతఁ ద్రోయ
నంతపని యేమి జేసె నీ యలరుఁబోఁడి
యనుచు నవ్వాలుఁగంటి యయాతిఁ జూచి.

క. వినువృషపర్వుఁడనం గాఁ । దనరు రక్కసుల తేఁడు తనకనిలోనం
బెనఁగఁదగు మాత్త నెంచుం । గని యెఱుఁగక జగము లేలుఁగడలేని సిరిన్.

గీ. అతని కూఁతురు శర్మిష్ఠ యనఁగ నొప్పుఁ । గూర్మి సకియలు పెసురు గొల్వ నెపుడు
నా చెలియఁ గూడి యాకొమ్మ యాడుకొను । చనరమరలు లేని చెలుములననఁగి పెనఁగి

వ. తిరుగుచు నొక్కనాఁడు.

క. రంగుతో డవులఁ బూఁతల । నంగునఁ గైసేసి యందునాడెడు తమిచేఁ
బొంగారెడు వేడుకతో । సింగారపుఁ దోఁటకరిగెఁ జెలువలుఁ దానున్.

సీ. మెదలు తుమ్మెదదిమ్ము రొదల చేనప్పొంగి దులకించు ప్రాఁబొదల్ దాఁటి దాఁటి
పలుమాఱు విరులత్రావుల తావులగు తీవయుయ్యెలల్ తగనెక్కి యూఁగి యూఁగి
వలిపపయ్యెదల కొంగులు దోలఁగఁగనిక్కి కొమ్మలందుచు ననల్ కోసి కోసి
పైఁడిమెట్టిక లెక్కి పైకేగి చేంతగట్లందు దాఁగురుమూఁత లాడి యాడి

పరువులెత్తెడు నంచలఁబట్టిపట్టి । గట్టిపుప్పొడి మెట్టలు మెట్టిమెట్టి
యలసి చెమటలు వాయ నోలాడఁదలఁచి యిందఱును గూడి కొంతదవ్వరిగి యచట.

సీ. పసిఁడిసోపానముల పైఁగుంది కట్టకై కదుసద్దు పైనజక్కవలకవలు
పరువంపుఁదొగలవెంబడిఁ గేరియుప్పనపట్టెలాడెడు తేఁటిపట్టికిదుప్ప
తమకంబులుప్పొంగఁదరఁగయు నెవ్వల లెక్కకరమూఁగు రాయంచ కన్నియలను
మాటికి నెత్తమ్మి మఱువునఁబింపిళ్ళ గూయు బెగ్గురు వాచకొమ్మగములు
మలసి చెలువంపుఁగలువల మాటునందు । మేఁతఁదలఁపక డాఁగురు మూఁతలాడు
నీటిపులుఁగులత్తటులములు నిగిడి మెఱయు । సిరులసీ నెడు సొబగు చేఁ జెలఁగి మడి

సీ. నలువగుకలువ మొగ్గలు జడల్గా నాఁచు పొలుపైన కుచ్చలి బోంతగాఁగఁ
గడు నొప్పసంకులు కామాత్మికవగాఁగఁ దామరవిరిముద్దు మోముగాఁగఁ
నైవ్రాలు తొగరేకు కకపాలగాఁగఁ బుప్పొడి మైనలందిన బూదిగాఁగ
సిరిమీలు తేఁదూఁడు సింగినాదముగాఁగఁ దలిరు తేఁదీఁగలాతంబుగాఁగ
ముదురుమంకెన పూవు కెమ్మోవిగాఁగఁ। దమ్ములు చూపఱఁ గొలిపెడు కొమరుఁదనపు
జోగుతాలును బోలెను సొబగు మీఱు । కొలను గాంచరి మదిలోని కోర్కెలలర.

వ. ఇట్లుగాంచి దగ్గఱం జనునప్పుడు.

క. ఒడికపుఁదన సొబగునకై । కడుచెప్పులు గలుగఁజూచి కొలనా [illegible]
నడకొలఁకులంచు వారికిఁ । గడువేడుకఁదమ్మితావి కానుకఁజేసెన్.

వ. చేసిన నచ్చెలువలు వలపుమించిన సొంపునం బెంపుగని కలంకదాఱంగి సిరిదొలఁకు
కొలంకు కెలంకునకుం జని నిల్చి.

గీ. పలుదెఱంగుల సొబగైన వలువలూడ్చి । చెందిరపుఁ గావి పావడల్ పొందుపఱిచి.
చిగురుగరులన్న దగుమరు చిలుకలనఁగ । నంతతెల్ల నుగొలనిలో పల్లికెఁజనఁగ.

గీ. తరఁగ చేతులఁబరువంపు విరులమట్టి । యమలు కానుక గాఁజేసియపుడు కొలఁకు
జెలియవారలయడుగులఁ జేర్చెఁదనదు । నాఁచు పేనలిపూఁదావి ననిచినిగుడ.

వ. ఇట్లు కొలనుసొచ్చి.

సీ. తమమోములకు నులుకి తగవడం బెడునట్లు తళ్కుగొట్టెడు నీటి తమ్ములలరఁ
దమచన్నుఁగవలయందముల కోడుటఁ బోలె జక్కవలొక్క మైఁజడలనెగయఁ
దమకొప్పులకు లోఁగి తలఁగిపోయెననంగఁ గప్పునిప్పగునాఁచు కడకుఁబోవఁ
దమకన్నులకు పీఁగి తలఁకుచందంబునఁ బెల్లుగాఁగఁ బ్యాలు తల్లడిల్లఁ
బూని తమచూపులకునోడిపోవు కరణిఁ । బలు మొగంబులఁద మైదల్ గలఁగిపఱవ
ముందుముందుగఁ జెలరేఁగి మూఁకలగుచు । నీటిలో నికెఁజను దెంచి నెలఁతలలర్చి.

గీ. చల్లులాడంగ నప్పుడు చదలనెగసి । మగుడు తెఱనీటితుంపరల్ దగిలెఁ జూడ
వారినీరాటకును మెచ్చి వలపుఁ బ్రాయఁ । దానికురియించు పువ్వులవానలనఁగ.

గీ. ఓలలాడి పట్టనరిగిన వాయ్యనీట
మునిఁగి దవ్వుల లేత్తురు ముదితలంతఁ
దెలిమొగుల్ సొచ్చి వెడలుచుఁ జెలువుమీఱు
మేలితుఱఁగలి గొనియెద్ద మించులనఁగ.

క. మగువ వడినీఁదుకొంతా । నాగిఁ దవ్వుగఁ బోవఁ జూచి యొక్క తెకలుచం
దగవైచిన కేశములైఁ । దగులుడును దివేల్పు జేనిఁదలఁపించెఁ గడున్.

క. తమ్ములు నక్కొమ్మలకనుఁ । దమ్ములుఁ గనఁగొనుచు నన్నదమ్ములటంచున్
జుమ్మని మ్రోయుచుఁ దుమ్మెద । దిమ్ములువతిమూఁగ మునిఁగి తేలుచు రలివల్.

క. వెలనాగల గుబ్బలమదిఁ । జెలులని జక్కవలు వచ్చుఁ జేరఁగఁ దమకా
బ్బలు వున్నదో యాబటువగు । చెలువున్నదో దానిఁ గెలుఁగఁ జెల్లునె యచటన్.

తరల. పలుదెఱంగులఁ బోవు చందురుఁ బట్టనన్నిటికన్నియై
యలిగి వేవెనువెంట నేగెడు నట్టిజాబిలి మేపరుల్
బలెజడల్గడు నీటఁ దేలుచుఁ బైపయింజను దేరఁగా
నిలువుటీఁతల వచ్చు కొమ్మల నెమ్మొగమ్ములు పొల్పగున్.

క. పొలఁతుల నీడలు దగియెన్ । బలువైరుచ్చెలుల పొలుపుఁ బడయుఁగఁ గోర్కెన్
జెలువనెలంతలు నీటన్ । దలక్రిందయితపము సేయఁ దగిలిరనంగన్.

పంచచామరము. దర్పింగ రంబు నిల్చిపొల్చి దాఁటి నీటిలోఁ బోరిం
చారిన్నునింగి తేలి తేలి పొల్తుకల్దలిస్తుర
చ్చరల్ మలంగ లంచ మిచ్చ సంభ్రమానందుఁబుట్టుచున్
దురీన లేచు నట్టిజాడ దోఁపఁ జూపటెన్నఁగన్.

వ. ఇట్లు నీరాటసల్పునట్టియెడ.

క. సురకరువలిచమదెంచిన । దరిఁ బెట్టిన కోక వెల్లఁ దడఁబడిపోఁగా
నరిగియవి దెచ్చి చెలు ల । బ్బురమగు తమచీర లెల్లఁ బూఁననంబున్.

క. లలినీనెఁతయుఁ దానును । వలువలు వీక్షడఁగఁ దాల్చి పైళమె చెలువల్
దలఁచెంపనెతెఁగి కనుకన్ । గులుకుచు రక్కసుల తేని కూఁతురు తెగువన్.

ఉ. నెట్టన శేఖ నింబగలు నేరమి పెట్టునటంచు వేలుపుల్
వెట్టియుఁ గొట్నములస్లులుప వీలనిచేబలు వాఁప్ప సోఁకుడ్సుం

బట్టముగట్టుకొన్న వృషపర్వుని కూఁతురనట్టి నేను నీ
కట్టిన చీరఁ గట్టుకొనె కావర మేటికి నీ కిచ్చ సేసికన్.
వ. విని యయ్యోలానాఁగకు దేవయాన యిట్లనియె.
క. ఉసురులొక్కటియై పొంపులె । వెస రెండును గనుండి వల్పవిద్యాధికుఁ గాఁ
గసరెడ విడితగవగునా । పసిబిడ్డవె వాయి దెఱచి పల్కెదవు చెలీ.
క. అనవుడు నుడుగక మిక్కిలి । కినుకం గేరడములాడ గేలిగఁ గొనుచున్
విని విని వేసరి యోర్వక । యెనసినవగతోడఁ గూడ నీపక్కుచని యెన్.
మత్తకోకిల. ఓలి రక్కసి వంగడంబున కొజ్జ కూరిమి కూఁతురన్
నేలవేలుపుఁ గన్నియం దగ నీవు గట్టిన పుట్టమున్
దాలువందగు నన్ను నాకని దానికర్హిఁ బల్కఁదా
నాలకింపక నూతఁ ద్రోచి గయాళియై చనియె న్వసిన్.
వ. అనియక్కలికి తెఱఁగెఱింగించిన విని కటకటంబడుచు మగిడి పోగడందగు తేజినెక్కి మక్కవతో యయాతి తన ప్రోలికిం జనియె నిట దేవయానయు శర్మిష్ఠ చేసిన యెగ్గు దలంచుచుం జనిచని.
క. తనతోడ వచ్చు ఘూర్ణిక । యను చెలికత్తియను జూచి యయ్యింతి మదిన్
బెనఁగొను వగలం బొగులుచుఁ । గనుఁగొనలం గిఱుకవారఁ గాఁద మకమునన్.
గీ. చెలువ వృషపర్వు వీడ నేఁ జేరనొల్ల । నయ్యకీజాడ నుడువు నీవనుడు నదియుఁ
జని యెఱింగించుటయు వంత పెనఁగొన గ । నాంటిఁ గాల్నడ రక్కసి యొజ్జ వచ్చె.
సీ. కలువలు ముత్యాలఁ గనియెడు సోనాఁగఁ బోరిఁ బోరిఁ గన్నీటి బొట్లు జాఱ
నిరులాఁకట మెసంగి యెరవేయు చుక్కలో నాఁ గప్పఁగొప్పున ననలు ద్రేల
వలఁబడ్డ జక్కవల్వాలె వల్పపయ్యెద నిట్టూర్పులను జన్నుమిట్టలదరఁ
గళుకు తైత్తమ్మిపైఁ గ్రమ్ము మంచును బోలె మొగమునఁ జెమటతుంపురు లెలర్పఁ
బండివాడిరయుల దొండపంటి పగిది । మొనసి వలువట్లు వట్టికె మ్మోవి దనరఁ
జెన్ను దఱిగిన సొగసుతో విన్ననైన । దేవయానఁ గనుంగొని తెగి చవగచి.
క. మును ఘూర్ణికచే వినుటం । దనకూఁతుం గారవించి తలిదుబోఁడీ
చనునే వగవఁగ నాకయొడ । సనయము నగు నలువ్రాతైన నవుగాములోగిన్.
గీ. కొమ్మ శర్మిష్ఠ తా రాచకూఁతురగుట । నెఱుఁగకీలాగు నిచ్చోట నెగ్గొనర్చి
తప్పు చేసిన నది నీకుఁ బడవఁదగునె । కొండికయుఁ గాదె యదియన్నట్లూఁదె వినుము.
ఉ. చెన్నగు మానికంబులును జెల్వగు గుఱ్ఱపు దామ తేనుఁగుల్ పదా
త్యన్నె పసిండి కోక్కి గడువంగను బాలులకిచ్చి యెన్నియేన్

జన్నము సన్నఁజేయుచున సంబునమీతెసువారు సాటియే
కన్నియ యల్క లేక యొడికంబుగ నుండెడి ప్రోడకెయ్యెడన్.

క. రిట్టినఁ గొట్టిన బన్నము । మట్టివనలుకయుఁను వగపు మనుదోఁచఁగుచునె
పుట్టున నలరిన మరలం । బుట్టువువారలకు లేదు పుణ్యంబోఁడీ.

వ. కావున నలుకనలఁదూవలకు నిలుకడయగుట దానివిధువవలయుఁ దెలియుమదియు
నుంగాకప్రోచువా యొకనాక్కకొదవగలిగినమది నిడందగదిదియేమిరమ్మనవుడు
దేవయాన యతనికిట్లనియె.

క. నిండుదలంపునఁ దరా । పొండనుగారవములే పొరపొచ్చెము నం
గొండంతపసిఁడి యిచ్చిన । నుండఁగాఁదగునె వారియొద్దం దంక్రీ.

క. నెల్లకొను చట్టలేకంబును । జెలికారము మునుపుదనకుఁ జేసిన మేలుం
దలఁపక యెగ్గులు వలికెడు । మలుచలకడనుండిరేని మోసము వచ్చున్.

వ. కావున నేను వృషపర్వని పీడుసారనొల్లననిన నతండు.

క. నట్టీనినుఁ బాసిననా । కెట్టు మెయిన్నిలుచును సుఖ లేమగడయునె
పుట్టునను నీవ నీతో । నెట్టనఁ జను దెంతు ననుచు నెగులునఁ బలికెన్.

వ. అత్తెఱంగున నుండ వృషపర్వుండటకువచ్చి వంతతో నెంతయు విన్ననయియున్న
కన్నియం దొడలపయి నిడుకొని బహువికఁగడలేక కడలుకొనునడలునం
దగులు నాజ్జలం గనుంగొని । మొక్కి యిట్లనియె.

సీ. దరములోఁ దెలగంటిదార నింగలపు వేల్పుఁ గడిమి గెల్చినది నీకతనఁగాదె
కలనిలో జముని రక్కసి తేఁ నెదిరించి గానిఁ బెట్టుటయు నీకతనఁగాదె
యసిలోననీటిరాయని గాడ్పు దెరలించి వెతమాలు బెల్లనీకతనఁగాదె
కయ్యానజక్కుల గమికాని ముక్కంటిఁగుతిలఁబెట్టుటయు నీకతనగాదె
తమ్మిచూలిఁయు వెన్నుండు దలఁకిమాకుఁ । గలఁగుచుండుట రొల్లనీకతనఁగాదె
కాకయుండినఁ దలఁప రక్కసులకెల్లఁ । జేకునిల్చునె జేజేల పేర్మి కతన.

క. అనిపలికి దేవయానం । గనుఁగొని రక్కసులతేఁడు కలఁగకు నీకీ
కినుకేమిటఁ దీతెడునది । వినిపి పుమొనర్తు నట్లు వేగిరమనుడున్.

వ. దేవయాన యిట్లనియె.

క. అట్లేని నీదుకూతిమి । పట్టిని శర్మిష్ఠ నాకుఁ బనిసేయంగాఁ
గట్టడసేయుమట్లన్నను । నెట్టన రక్కసులతేఁడు నెమ్మదిలోనన్.

క. కరమలరి కూఁతుగను పెం । పరయక యాతండు దేవయానకొసఁగె వే
వ్వురువిరిబోఁడుల తోడుత । వరుసను శర్మిష్ఠఁ దెచ్చి వరపుడ్డుగాఁగన్.

వ. అప్పుడు వృషపర్వుండు తనకూఁతు నిచ్చుటకు సంతసిల్లి దేవయానిం జూచి శుక్రు
నకిట్లనియె.

క. ఏకస్త్రీ కాలమింటం | జూడము ముంగురులు గూడుచుం గొనబున ని
ట్టీడేరి కట్టుదప్పిన | చేడియ నిఁకనైనఁ బెండ్లి సేయందగదే.

గీ. అనిన శుక్రుఁడనియె నా సోఁకుఱేనితోఁ | గలదు దీనికొక కటికచుఁడు దొల్లి
పెలుచ నేలవేల్పుఁ బెండ్లి గాకుండెను | మనుచుఁ గినుకఁ బలికి యతఁడు చనియె.

గీ. అంతకతమున నీయింతి కెందుఁదగిన | చెలువు నెవ్వని గూర్చునో నలువ యనుచు
వంతనున్నాఁడఁ గాక యీవాలుఁగంటి | పెండ్లిఁ దూఁగించు టిది యెంత పెద్దమాకు.

వ. అనవుడు.

క. అయ్యా కచుఁడన నెవ్వం | డయ్యో యీ ముద్దరాలి నట్లనఁగఁగతం
బెయ్యది యనవుడు నత్రాలి | దయ్యాంబుల యొజ్జవలికెఁ దగ నాతనితోన్.

సీ. వినుమన రక్కసులును వేలుపులుఁ దొల్లి కలనిలోఁ బోరాడి పొలియుచుండఁ
దెగిన సోఁకుడుమూఁక మగుడ నా బలువిద్దె పెంపు చేఁ బ్రదికి రంపిల్లుచుండ
జేజేలు పొలివోయి చేయునట్టిది లేక కింకతోఁ బొగిలి యాకీలెఱింగి
యద్దిసేర్చ రాఁ బ్రోడ యెవ్వఁడో యనఁ జాలఁ దలపోసి తమయొజ్జదండకరిగి
విన్నఁదనముల చేసొంపు చెన్ను దఱిగి | యందఱు చ్రొమ్మొక్కి ముందఱ కరుగుదెంచి
కలఁక డగ్గుత్తికల చేత నెలుఁగు రాలు | పడుచునుండఁగ నిట్లని పలికిరపుడు.

గీ. రాజమగఁడైన వెనుకను రాజుకడియ | మన్న సామెత నిక్కంబె యయ్యె మాకు
నీవు గల్గియు నిటువంటి నెగులు గల్గె | నింక మా చందమేమని యెన్నఁగొనఁగ.

క. వినురక్కసులును వేల్పులు | ననిరెడు నీరెంత దెగల నా శుక్రుఁడు నీ
వునుగద నడిపెడు వారతఁ | డనినీల్గిన పొలసుదిండ్ల నందఱ మనుపన్.

క. బలిసిరి రక్కసులని లోఁ | బొలిసినవారెల్ల మనఁగఁ బోయినపోకై
యలసిరి వేల్పులు మగుడం | దలఁకొను బ్రదుకాస లేమిఁ దలఁపవు దీనిన్.

క. అనయము నీతో సరివాఁ | డనిలో రక్కసుల మొనల నన్నిటి మనుపన్
దనవారిఁ బ్రోవఁ డితఁడన | వినుచును నీసడికి నెట్లు వెఱవవు తండ్రీ.

గీ. ఒరునిఁ బ్రోచుటకొఱకుఁ గానరుగుదెంచి | చెనఁటి నైనను వేఁడఁగాఁ జెల్లుఁ బుడమి
వెల్లు చు జేజేలఁగమిఁ బ్రోవ వెన్నుఁడరిగి | రక్కసుని వేఁడెనతనికిఁ దక్కువేమి.

ఉ. దేవర పట్టినిక్కుచు మదింబసిబిడ్డఁడు నాక పేర్మి సం
జీవని చేరఁ బంపుఁడది నేర్చును నీతని చేతఁ బెంపునం

జేవయుం గల్గువారలకుఁ జిన్నఁదనంబు దలంపవచ్చునే
కావున దీని కియ్యకొనఁ గాఁదగు మాపంపుఁ గల్గు ప్రేముడిన్.

చ. అనవుడు నెట్టకేలకతఁ డర్మిలిఁ బంపఁగఁ జూడు వచ్చు న
మ్ముని బాడఁగన్న మేనుతని ముద్దుగొలంకెను రూపుఁజూపి ర
మ్మని కడుఁ గారవించి మది నారసి కూరిమిఁ జెప్పుచుండఁగా
నతన రెడు నేర్పు చేఁ జదువు చుండెను దెబ్బని దేవయానతోన్.

వ. ఇట్లు చదువుచు.

క. చట్టుఁదనంబునఁ గనుమా । పట్టునఁ గనికరముఁ గూర్మి బయలు పడంగా
నెట్టుకొని వేల్పుటొజ్జల । పట్టికచుండొరిమతోడఁ బనులొనరించెన్.

ఉ. ఎన్నఁడుఁ గంటలేను వినుమిత్తెఱఁగెల్లను సోఁకురాయ యూ
కన్నియ దేవయాన మదిఁ గ్రమ్మెడు ప్రేముడి నిచ్చలుంగచుం
గన్నులఁ గానకుండిన వగం జుర పిల్లి యొడల్లో అంగుఁ డా
నన్నవి యేమి చెప్పనిఁ కనుగ్మలికింగల కూర్మి యెట్టిదో.

క. ఇత్తెఱఁగునఁ దొయ్యలికి । నెత్తురు పాత్రగుచు నతఁడు నిచ్చలు మలో
హత్తిన ప్రేముడిఁ జదివెడు । నత్తఱి నొకనాఁడు తేపటంతఁ గడంకన్.

క. తనకుఁదగు నేల వేలుపుఁ । బనులెల్లను దీర్చి ప్రేల్మి పసరముఁ గావన్
చెనుకొని యడవికి నరిగినఁ । గినుకన్ రక్కసులు వాని గీటునఁ జివెసన్.

గీ. పట్టి యొక క్రూరనితో నంటుఁ గట్టివైచి । మరల వచ్చిరి యంతఁ దానురలవించు
కచుని యునికికి నడలుచు గడనుఁ బోవు । కరణిఁ గను పట్టి పడమటి కంటిమునిఁగె.

వ. కచుండు రామికి దేవయాన తద్దయుం జుర పిల్లుచు నిట్లనియె.

గీ. అకట ప్రొద్దు గ్రుంకె నావులుఁ జనుదెంచెఁ । గచుఁడు రాఁడి దేమి కతము నేఁడు
చిలువగములు రక్కసులుఁ గొట్టుమిట్టాడు । నడవిలోన నేమి యయ్యెనొకొ.

క. అనివగచు దేవయానం । గనుఁగొని లోచూపు చేతఁ గాంచి కచుం దేఁ
బని చిలి సంజీవని నడ । యూవుగ మైను సులునించి యతని దెచ్చెన్.

వ. ఇట్లు పెక్కువరుసలు రక్కసుల యుక్కువంబున మక్కువ బ్రతికింపనుండి పెండియు
నొక్కనాఁడు.

క. అడవికి పేలిమిప సరము । బడిఁ జన రక్కసులెటింగి పట్టుకొని కచున్
వడిబూది చేసి నొకుం । దొడిఁ బడఁగాఁ గల్లునీటితో నిచ్చిరొగిన్.

ఉత్సాహ. గుట్టుతోడ ట్లొ సగఁ గ్రోలియేను నన్నుతో
గుట్టుపాటియుండు నంతఁ గ్రుంకు మెట్టు చిత్తవుం

జుట్టుమీఁదఁ బ్రొద్దుచేరె సంజతోఁడనీటిరా
పట్టుపయ్య కెంపుగోఁడపట్టు పైఁడిసాననాఁ.

క. అక్కఁచుఁడు జామినప్పుడు । పొక్కుచు నీ దేవయాన పొడమువగన యో
రక్కసులచేత మడిసెనె । యక్కటతనుఁగన్నతల్లి యటమట గుడువన్.

ఉ. అక్కరులా మొగంబు చెలువాకనుఁ దమ్ములసోయగంబు నా
యక్కనుజేతు లానడుము నాపిఱుఁదా తొడలా యొయారపుం
బిక్కలు మెట్టుఁదమ్ములును బ్రేముడి నామదిఁ బాయకుండఁగా
నక్కచు నెట్టుగామ అతు నాఅడిదయ్యము యింత చేసితే.

క. మునునలువ యొఱెఁగి మదివా । కినుమునఁగావింపఁబోలు నిమ్మెయిఁగాకుం
డినసింతతడవుకచుని౦ । గనుఁగొనకుండుటకు నెట్లుగా నిటులోర్తున్.

క. అనివాఁడు రాకయుండినఁ । దనమేను దొఅంగమదిని దహాతహాపడు దీ
నినిఁగాంచి చాలవేసరి । యొనసినవగడిందు పలుప నేఁట్లంటిన్.

క. వినువేల్పుటొజ్జకొడుకని । కినుకన్ రక్కసులువాని గీటడఁచెదరా
తనికింతవగవనేటికిఁ । జనుఁగాకలపుట్టువేసు చక్కిఁకిఁగడఁకన్.

వ. అనవుడు మిగులవగలనాఁగిలి యిమ్మగువ యిట్లనియె.

చ. గొనములప్రోక యంగిరసు కూరిమిమన్నఁడు వేల్పుటొజ్జపే
ర్మిని గనుఁగొన్న బిడ్డ మఱిమీకును జట్టు కడింది రూపు నే
ర్పును గడు నేమముంగలుగు ప్రోడ వితా తొలువేల్పు మూఁకచేఁ
జనినకచుం దలంప మది జాలిఁగరంగదె యెట్టివారికిన్.

సీ. జగములఁగలిగింపఁ జాలునల్మొగముల దొరపట్టియైన యంగిరసుమన్నఁ
డరయవేల్పుల్లకెల్ల నయగారనందగు నుడుగు తేనికిఁగూర్మికొడుకుఁగుఱ్ఱ
వేతాలునోఁచన నోములపంటయై కనుపట్టఁగాఁ డారకన్నబిడ్డ
భృగువుమూడవయప్పతగఁదీర్పఁగలిగిన పెనులిప్పవగునీకు ననుఁగుఁజట్టు
నేలవేలుపుమొదలిటి నేమములకు । నెలవు చెలువపు గమి కాఁడ్కు మాలి కుమారి
రక్కసులచేతఁ బోయిన యక్కచునకు । వగవకెట్లోర్తు పైయెల్ల నాగులఁదండ్రి.

గీ. అతనిఁజూచి కాని యారగింపనటంచు । వగచుచున్న దీని తెగువ యొఱెఁగి
చిదిమికడుపులోనఁ జేపెట్టికలఁచిన । యట్టులైన నోర్వ కడలి న్నెన్న.

మ. వినులోచూపున నేలపైనడవులు న్వ్రాళ్ళు న్మలల్సంద్రము
ల్పెనుదీవుల్గగు పల్లియల్వెదకి మాళింజిల్వపేఁడ్లిమ్ములు

స్విను ద్రోశుల్లడు వేలుపున్నెలవు లన్నిం జూచి యేఁ గానలే
కనయంబున్మదినబ్రముస్వగపు నాకంతంతము గ్రమ్మఁగన్.

గీ. మఱియు నట్లు చూడ మదిలోనఁ దోఁచినట్టి | గఁటిబూదియగుచుఁ గల్లుతోడఁ
గలసినాదు నింద్యుఁ గడుపులోన నయున్న | కచుని సంతసంబు గడలుకొనఁగ.

క. కలుదోసంబున రాకా | సులు చేసినయట్టి కాని చొప్పను మదిలోఁ
దెలిసికొని యులుక వాడమినఁ | గలఁగుచు నిట్లంటి నిజ్జగంబుల నిల్పన్.

క. తొలుబాముల బలు నేమం | బులతోడం బెక్కుజన్నములు సేయంగాఁ
గలతెలివిఁ జెఱుచు నియ్యెడఁ | గలు ద్రావందగునె యెఱుకగలవారలకున్.

క. అనికలు ద్రావుట యెవ్వరి | కిని గాదని పలికి పంతగించుచు సంజీ
వని చేతఁ గడుపులోఁ గచు | నవున బ్రతికింపఁ దెలిసి యతఁ డిట్లనియెన్.

ఉ. ల్లావుఁ గడంకయు న్మఱిన లంగని మేనును బొందఁగల్గనే
దేవర విద్దెచే బ్రదికితిం డగ నీకడుపింక వెళ్ళనే
త్రోవయొ యానతీవలయుఁ దోఁచినలాగున నన్నుఁ బ్రోవఁగా
నావుడు నోటకుంచుమని నామదిఁ బీడకుడెంచు జెట్లొకో.

వ. అని పలుదెఱంగులం దలపోసి.

క. వినుకడుపు వ్రక్కలించుచుఁ | జనుదేరఁగ ప్రోలిపడ్డ సరగ నెకడఁకన్
ననుబ్రదికింపఁగ సంజీ | వని చెప్పితిఁ గచునకపుడు వదనికూర్మిన్.

గీ. బ్రతుకుత్రోవ యిట్లు పరఁగ నేఁ జెప్పినఁ | గచుఁడు పెడలెనిండు గడుపు వచ్చి
పుట్టుగట్టుచఱిని బొడమునమ్ములవిందు | కరణి మేనితెల్వి కడలుకొనఁగ.

చ. వెలఁగుచు నిట్లు దాఁ గడుపు చించుచు వెళ్లిన మేనిలోను సుర
దొలఁగుట నేలపైఁ బడినఁ దోడనె నన్బ్రతికించి నేర్పుతో
వెలసెను వానికిం బ్రతుకు విద్దెయు మిక్కిలి పెంపుతోడ వే
ల్పులు గొనియాడుచుం గురియ పువ్వులవానలు మీఁదఁ బర్వఁగన్.

వ. ఇట్లు సంజీవని వడసి కచుండు త్తాఁ దడవున్నవాఁడయి మాతో నొక్కనాఁ డిట్లనియె.

క. మీరును మీదేవేరియు | గారవమునఁ బ్రోవఁ దడవుగా నిటనుంటిన్
గోరినది గల్గెనంపుఁడు | తారను మాతండ్రిఁ జూడఁ దలఁచితి ననుచున్.

ఉ. పిన్నవుగాన నీవు కడుఁ బ్రేముడి ముంగిటిలోనఁ ద్రిమ్మరన్
నిన్నబలెం దలంపఁబడు నీవిట నిల్చిన పెక్కుఁ లేండ్లు మా
కన్నులు వాచు నీమొగము గానక యెప్పుడుఁ జూడకున్న నా
య్యన్న యిదేటికిం దమక మారసి చూచిన వింత గాఁడవే.

క. నీవనఁగ దేవయానవు । గావఁటే మాకు వింత గాదే కద నీ
కీవేగిర మేటికి మది । నావుఁ బనతఁ బెట్లొన్ని నాళ్ళుండి వెసన్.

వ. తీనవీటికిం బోయెదనని విన్నవించుటయు.

సీ. కరము పెద్దయిన యంగిరసు చెంతకుఁ బోయి చక్కఁగాఁ జాఁగిలి మ్రొక్కెననుచు
జేజేల రాజ్జయై చెలఁగెడు మీతండ్రిఁ గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చుకొనియెననుచు
తనతోడఁబుట్టువుఁ దారనెమ్మదిలోన నర్మిలి దైవార నడిగెననుచు
కడు జయంతుఁడు లోనుగాఁ గొమాళ్ళను గూర్మి వేల్పు చున్నీని దీవించెననుచు
మఱియుఁ దక్కినవారి నామాటగానె । తగినలాగునఁ బలుకు మందఱకుఁ జాల
నలరు నీవని చెప్పినే ననుపనతఁడు । నరుగ సమకట్టి యున్నచో నప్పుడెలిఁగి.

సీ. ముదుదు వెన్నెలగాయు ముత్యాలతిన్నెపైఁ బైఁడి యచ్చనగండ్లు పాటపైచి
మఱియాడి యాడి తామర కెంపుఁ బీటపై నోమనగుంటల నుజ్జగించి
పాఁపమే పరిపచ్చ పన్నారులోవులఁ గులుకు గుజ్జనగూళ్ళు గుడుచుటుడిగి
తనయీడు వారైన తలిరాకుఁ బోఁడ్లతో సిరిబొమ్మ పెండ్లిండ్లు సేయక డఱి
తోడి చెలులెల్ల వెఱఁగుతోఁ గూడరాఁగ । గొనబుఁ గనుదమ్ములను నీళ్ళు గ్రుక్కుకొనుచుఁ
జిన్నివేసలిజాఱంగఁ జిన్నవోయి । తెగువ నచటికి నేతెంచె దేవయాన.

వ. ఇట్లు వచ్చిన నక్కచుం డిట్లనియె.

మత్తకోకిల. తోడఁబుట్టుగు కన్న నీవాఁగిఁ దోడు నీడయి ప్రాణఁగా
నీడ నెకొద లేకయుండితి నింక మాతలిదండ్రులన్
జూడఁబోయెదనయ్య వారలఁ జూచి రమ్మని పంపెనో
చేడియా మదిలోన నాదగు నేమమారయుచుండుమీ.

క. అనిపలుకఁ గొమ్మమిక్కిలి । తనమది గలఁగంగ నిట్టితలఁపులుగలవే
మును నీకు కూడగులము । నానరించెం దమ్మిచూలి యుల్లములంపున్.

సీ. ముగురు వేల్పులు మెచ్చు భృగువు నర్మిలి మనుమఁడన్నది నీకుఁ జవువుగాదె
యునయంబు దొలివేల్పులయ్యగారికిఁ గూర్మి యల్లుఁడన్నది నీకు ననువుగాదె
పొగడు నీలువు చేతఁ దగు దేవయానకుఁ బెనిమిటియనఁ నీకుఁ బెంపుగాదె
తుదవృషపర్వుఁడు మొదలైన రక్కసుల్మన్నించుటది నీకు వన్నెగాదె
తోడఁగియాఁ గామినీ మదిఁదోఁచకున్న । ననుఁగులగు పెద్దవారల నడిగిచూడు
మేలవిడనాడ నాలిగోఁ సేలునన్ను । వినుము చెప్పెద మాటలు గన్నెయము నేల.

క. అనఁ జెవులు మూసికొనుచుం । దనమదిలోనలిగి కచుఁడు తలిరుంబోఁడీ
వినఁదగని పల్కు పలుకం । జను నే తలపోయు నిట్లు చాలును దుగుమీ.

క. విను శుక్రుడు చెప్పిన తెఱఁగుం । దన తండ్రియు నాక్రూరపు దలఁపఁగనిన దిగా
వున నీవు నాకుఁ జెల్లెల । వను వగు నా యట్టిమాట లాడెఁ గసికిన్.

ఉ. నావుడు దేవయాని మదినాఁటిన యల్కనఁ బైఁ నీకు సం
జీవని పంపుసేయదని చేరికఁ బల్కె నతండమిక్కిలిం
దావగ నొందియో సెలఁత నాకదివమ్ము పోయె నేనియున్
నీతనియట్లు నావలన నేర్చిన వారికిఁ బంపుసేయదే.

క. అనికిన్క తోడ నిటువలెఁ । బనిమాలిన పాట నన్నుఁ బలికితివటు గా
వున నీకు నేల వేలుపు । పనిమిటి గాకుండునను చుఁ బలుచన్నాడి పెన్.

వ. ఇట్టి కొమ్మఁ బలికి కచుండు తన నెలవునకుం జనియె నని పలికి శుక్రుండు వృషపర్వుం
డును దోడ నేగుదేర వీటికిం దోడ్కొని వచ్చిన దేవయాని శర్మిష్ఠ కొలువఁ
బాటలం దేటమాటలం దోఁటలం బ్రొద్దుగడపుచు నుండెనంత.

చ. కొలకు లెడ తేజు చేఁ బసిఁడి గుబ్బలి యన్నటి వెండికొండయుం
గొరఁగునటంచు సంద్రములు కాఁకల నింకునటంచు నెల్లెడ
న్నయయున సంపుఁ గప్పురము నించి జగంబులఁ గల్గు వారలుం
డలుగొని యాపుచుండఁగ సతంబుగ రాసిరిఁ గన్న నేర్పరీ.

క. పురుకుత్సు రంతిదేవు స । గరుని మాంధాతఁ బృథుని గయుని దిలీపున్
భరతు యయాతిం దెగడెడు । సరవిం జగములను మించు చాగపుఁ గడలీ.

మాలిని. నలు మొగములచూలు న్నల్లనామేని డాలుం
జెలఁగు నడుగు జాలున్ జిందము జుట్టువాలు
న్వలచు కలిమి యాలు న్వన్నెమవ్వల్వ మేలుం
గలుగున తెఁడు నీపైఁ గల్మితో నుండు మేటీ.

గద్య. ఇది శ్రీమదనగోపాల మంత్రప్రసాద లబ్ధసారస్వత సుకవిహితవచోవిభావ
భావనామాత్య తనూభవ పొన్నికంటి తెలగనార్య ప్రణీతంబయిన యయాతి
చరిత్రంబను నచ్చతెలుఁగుఁ గబ్బంబునందుఁ దృతీయాశ్వాసము.

## చతుర్థాశ్వాసము.

క. సిరిమీఁటిన దొరజాలిడే । వరమానిసి తనము పూని వచ్చిన సెకకెన్
దొర వేలుప బలుసిలుకడ । తఱికొండ యమీను ఖాను తలఁపుల నెలవా.

వ. అటమీఁది తెఱంగు వినుము.

చ. కరువలిరక్కసుల్ కెరలి గ్రమ్మినడంకఁగ బ్రాఁకువేల్పులన్
దానకొని యాకురెంటెటులు దోఁచఁగఁ గోవెల కూఁతఁ జెప్పఁగా
నరయుచు వారల్లంగడిమి నామని వెన్నుఁడు నాంపఁజెందు నె
త్తురుబలె లేఁజిగుళ్లలరెఁ దోఁపులఁ జూపఱ చూడ్కిఁ బండువై.

సీ. అలమింటఁ జెలఁగురా చిలుకలచాలుపుల్ వేలుపు మన్నీని పిండ్లు గాఁగఁ
బూఁదేనియలఁ జాలఁ బొదలు తేఁటులు ద్రోఁత రహిమించు నునుఁబులి రవలి గాఁగ
మూఁకలై ప్రౌఢవైన చీఁకటి ద్రూఁకుల చాళ్లు గారొప్పిన్న మొగుళ్లు గాఁగ
వెలుతురీ నుకజాలు చిరిదేనియలసోన వదలక కురియు పెన్ వాన గాఁగ
వేసకలు మీఱఁ దోఁటలనాడుకొమలు వెలఁదు లెల్లను మెఱుఁగు దీవియలు గాఁగ
గ్రమ్మియుప్పొంగుచును దోలుకారువోలె । వలపునెఱపుచు నామని పొలుపు మీఱె.

గీ. ఎలమిమై జాజి యూరంపు టేనుఁగులను । నొంచు నామని యను తెఱనోటి మెకము
గోళ్లనంగను దగి మేడుగులను మొగ్గ । లమరెఁ దమరంగు మిన్నెల్ల నలమికొనఁగ.

క. క్రొంజిగురుజొంపము । లందగెబలుమావు లంత లలినెల్లెడలన్
జెందిరపుఁ గాఁపపరగల । నందంబగు మరుని తేరు లనఁగాఁ బూలుపై.

మత్తకోకిల. ఏ చెమావులుఁ గ్రోవులున్ దగు నిప్పలున్ గురివెందలున్
బూచెనిమ్మలు దాడిమమ్ములుఁ బొన్నలున్ సురపొన్నలున్
గాచెఁ జిన్నల కన్నమున్నుగ గంగరావులు మావులున్
రాచెఁగొమ్మల సింగిగోఁగులు రావులున్ గడురీవులన్.

శా. ప్రేలుంగొమ్మలు నేలదారసిలినన్ వెళ్లంగ రాకుండఁగా
లోలోఁ ద్రిమ్మరు నాలిగాడ్పులు పగళ్లన్ రేలుఁ బూఁదావులన్
జాలన్ ముచ్చిలి ప్రోవఁబట్టుకొని పజ్జన్ బచ్చగండార్లలో
సోలన్ గా[illegible] బొట్టె గామని యనన్ జూపట్టె తేఁదోఁటలన్.

గీ. అసురేఁబుప్పొడికుప్పలై యంతనంత । మెట్టదామరపాకుల మీఁదజాతి
పైఁడిచాలాలి వేళ్లువాయఁదోఁట । కలిమిచెవిపెట్టు కలవంటకంబులనఁగ.

చ. చలిమిరిగాడ్పుచే నెగసి సన్నపుసుళ్ల గుచ్చాకసంపుమం
దలవిలసిల్లెఁ బుప్పొడులు దట్టముగా మదిఁ గ్రమ్ముకూర్మిచేఁ
గలఁగి విరాలిఁ గుందు తెఱగంటి నెలంతలమీఁదఁ జొన్పు పూ
విలుతుని పైఁడిచుట్టులుఁగు వేలములుంబలె నొంపు పెంపునన్.

క. అగిసె నిరుల్ కరువలిచే । నెగయం దోఁ దేఁటిచాల్పు తేగుందలుచై
తోఁగరాచ పదువులన్ వెను । తగులుచు నెలదిండి పించు దాగ్రాసుపగిదిన్.

మ. ఎటమీఁది దుమ్మైద(మ్రోఁతవా సెరవలై యింపొందవత్తిల్లుకో
వెలసీకారుల కూఁకపాటలమరఁగ వేశోకాళీ నాలిగా
ద్పుల పేరడగల నట్టువుల్ గఱపఁగో ఫుల్ చూపు లేఁడీపపా
త్రలకయ్యాహుని ప్రావు మత్తై ప్రసరుల్ జాల్పఁగ నిచ్చెఁ గడాన్.

వ. మఱియు విరితేనియ లానిపూని మత్తిలి తత్తఱంబున దిసుగు తేఁటిమొత్తంబుల
రొఱఁకలసేన్నం గరువలి గట్టువనట్టువ గఱప నామనిరా తేనికచ నాటకశాల
రలముందఱఁ గ్రొంజుగా నెత్తినమవ్వంపు నప్పటంబుల తెరలమరువులసం గ్రమ్ము
పూఁదుమ్ముల మన్మరంబులం గొమ్మలంగానక త్రిమ్మరు కలికిఁగా చిలుకల పలుకుల
రొదల నెదలు కలంగ మెలంగు తెరువరుల నేయ బాసటంబు పిలికిన మరునిపలుకులు
వాసి తుమ్మెదదిమ్ములనలరు నలరులం గాంచి వలతేని కానిపనికేఁగినకం గినసంగ్గాను
తోఁటకలిమి చెలియచూపుల సొంపునం గొంపుపోసనంబులగు దాసనంబులును దాస
నంబులు చీఁకటి క్రొమ్మాఁకుమూఁకలలోన నిరులు దొరలు తమదాయయగు చేఁడి
వెలుంగు నింగికివెఱచి పఱచిన నతఃమైపుట్టుగులం బట్టిలోన దుకొన్న వసువున
నన్న గేకిసలు గొట్టు నిర్లపట్టి కింసునుంబో లెఁ జెలంగు కోవెలలును గోపెలలొఁగరుం
జిగురు లుమియంగని మన్నీటితో నానిన మానికంబులు వెదలించు నించుమొగు
లుం దెగలని చెట్టుగానాడు జుట్టునట్టువపిట్టలు కఱచిలువ తెఱవలను తలంపు
పెంపున జడలకొడియ వడివడిం దీవ యుయ్యలలూఁగు మగువలనగవు వెన్నెలలోన
చుక్కల పెక్కువలుంబోలెఁ గానిపించు పొన్న మొగ్గలును బొన్నమొగ్గలహత్తిన
ముత్తైపుందొడవు లయ్యెడనడి పూఁదేనియల జలకంబాడు తోఁన్రవేలుపుఁజానకు
దిద్దిననిద్దంపుఁ బసపుముద్దల యొద్దికందగు పెద్దమ్మపండ్లును నిమ్మపండ్ల యుచ్చ
పుఁ బచ్చడాలు చాలన్నిలుచుం గారుగొంగుల పైఁబగ్వాఁజనుపకంబులని కలంగి
తొలంగి చేరికతిరుగు తత్తరంబుల తేఁటిమొత్తంబులం గేలిచేసిమించు తీవెచాసల
యొలుంగులనం గులుకుపలుకులుగల కలికిచిలుకలును జిలుకముక్కుల నొక్కఁబడు
మారేడుపండ్ల చెన్నగని తమరియున్నల చన్నులపోలికలనవిరాలింజాలింబడు తెగు
వరులంజూచి నగచు క్రొమ్మాఁకులకన్నీరునుం బోలెజోరునంజాలు పూఁదేనియలును
బూఁదేనియ కాలువవాళ్ళ నుల్లంబడి వడివడిందిరుగు నురుని కెంపుబొంగరంబు
లుంబోన్ని మెట్టదామర మొగడలును దామర మొగడల్లం దెగడు చిన్నిచన్నులు
గల కన్నియలున్న చూపం బూఁదేనియలాని తేనియలయందుంబాడు నేగ్వలకు
హెచ్చి పచ్చవిల్కాఁడు గురియించువిరివానలు బోలెంగరువలిచేఁ దొరుఁగుపరు
వంపుననలునుంగలిగి వలరాజులాయుంబునుం బోలె మాఘులకుం జానకం స్త్రై చా

కారసి కేయొడి కారవుఁగింకను । నేరము మాకిది నేరము బొంకను
నీడకుఁ జెలి రాకీడకుఁ గోయఁగ । నాడకు రా విడ నాడకు పాయఁగఁ
బనసల పైఁబూఁ బనసల్ గనుఁగొను । పనుపడ్డవి మరుపనులౌను వినుము
మరువము చెలి నామరువములోయను । కలువో విరులక్కలువోఁ గోయను
మాటకు మారక మాటకు వత్తురె । బోటులు నటిమీ బోఁటులు మెత్తురె
యనుచుఁ దగిలి సయ్యాటలఁ బాడుచు । ననవిలుకాని వినంగొనియాడుచు

వ. ఇట్లు నీటుమెఱసి తోఁటలనాడు బోటులాటసాలించి.

క. కప్పుం గొప్పులఁ జన్నుం । గప్పుల మొగముల నాడఁల్లఁ గప్పిన మెఱుఁగుం
బుప్పొడి విదిరిచి కొనిమఱి । యప్పడఁతుక లరిగి కప్రపసఁటులఁ జెంతన్.

సీ. పుప్పొఁ దేనియ కాల్వ పొంత పొన్నలలోనఁ బొలుపొందు చెంగల్వ కొలనిదరిని
పూచిన చంపకంబులు చుట్టివచ్చిన గురివెంద తీవ పందిరులయందుఁ
జలువల నెలవులై యలరారు నెఱతాల తిన్నియల్ పన్నీటి తేటనలికి
విరివిల్తు నతని దేవేరిఁ గస్తురిఁ దమ్మి తేకు పైవ్రాసి గుఱించి నిలిపి
కమ్మవిరినీట జలకంబు గానుగూర్చి । నగవు ముత్యాల తొడవులు దగనమర్చి
కలికి క్రొన్నన పొదబాసికములు చేర్చి । సిరుల నెదిరించుచును పెండ్లి సేయుచుండ

గీ. నాలిగాడ్పను కాలరి యోలినరిగి । వారివేనలి విరులనింపారు తావు
లెల్లఁ గానుకగా నిచ్చి మెలమిఁ బిలువ । నచట వేఁటాడుచున్న యయ్యాతి వచ్చి.

క. తెలిమొగులలోన వెలిఁగెడు । తొలుకారు మెఱుంగు పగిదిఁ దోరపుటొజ్జల్
దులకించు నాటతమిచే । నలరుంబొద వెడలివచ్చు నలశర్తిభత్యన్.

వ. కాంచి యగ్గుబ్బెత సోయగంబున కబ్బురపడి యబ్బలియుండు తనలోన.

సీ. తమ్ములు చుక్కలు తాఁబేళ్లు మరుపొదుల్ పసిఁడియనంటులు నిసుకతిప్ప
సుడిచదల్ బంగారు కడవలుఁ దీవియల్ చివురు చిందంబు పసిండియొద్ద
ములు తలిర్వెన్నెల మొల్లమొగ్గలు నువ్వుఁ బువ్వు మీఁబునన దూపులును విండ్లు
నరతొగదొర సొగ సిరి వ్రాంత చెలువముల్ రహిమించు జేజేల రాచఱాలు
నివిగదా పోలికలు చూడ నింతులందు । నొడలి యొప్పులు గొనియాడుచున్న మెఱ
నవి బెడంగుగ నీచానయందు సాటి । సేయవచ్చిన నేరక్కి సిగ్గుగాదె.

గీ. మరుని యురులనఁదగి క్లేఁటి సిరుల వఱలు । తెఱవ కురులకు సరిరామి దీర్ఘెఁ గాక
కడిమిఁ దమ పెంపు వొఁబూరి గఱవనేల । రహియ అన్. వేలుపుటిరాచ రాలకెల్ల.

క. మరుఁడర నెలకడ దాచిన । విరిదూపును నల్లచెఱకు విండ్లను బలెవే
ఘుఱున్గలరు చేరుచుక్కయు । నరుదగు కనుబొమలు మిగుల నతివకు ననరెన్.

క. నెలఁతుకకన్నులనంగాఁ । బొలుపగు నెలవెలుఁగు మేపుఁబులుఁగులు తమిచేఁ
గొలఁదియె యుంగకతినివె । వెన్నెలగ్రక్కెడు నదఁగనెసఁగు నెలకొనునగవుల్.

క. తమ్ములఁబూనిల్తుని క్రొ । త్తమ్ములఁ జీఱికి నొనక యడకించుఁగడున్
గొమ్మనిడు నాలుఁగన్నులుఁ । గ్రొమ్మించులు గలిగిపొల్పు గులికెడు చూపుల్.

గీ. పెలుచఁదమడాయుధమైన సంపెంగవిరిని । గెలిచెనని ముక్కు నిరుగడఁ గొలిచియుండి
త్రుళ్లియాడెడు తుమ్మెదపిల్లలనఁగఁ । బొలుచు నెలఁతుక చూపులు చెలువమమర.

గీ. కప్పురము పాదులోపలఁ గరము సరది । నాటి వెన్నెలయను తేటనీటఁ దడప
మొనలు చూపిన ముత్యాల మొలకలనఁగ । నారవుతో డమతఁ జెలిపలువరుస దనరె.

క. లలిఁబంచదారలోపలఁ । దిలకింపఁగ నించి జుంటితేనియలు కడున్
జిలుకఁగ బెరిగిన పగడపుఁ । దలిరనఁగా నతివ పెదవి తగుఁ గొనియాడన్.

తరల. చిలువ బొంకెమెకంబు చెట్టని చెప్పకొంచు రుకల్ల యీ
పొలఁతి నెమ్మొగముం గడంకను బోలఁజాలక నెమ్మదిన్
గలఁగి మక్కులరాయుఁ డెంతయుఁ గంది పెల్పెలఁబాటెఁగా
కలరు విల్తుని మేనమామగు నయ్యకాకొదగల్గునే.

25960
25.3.73.

గీ. చెలువ మెడతుంటవిల్తుని బిందమరయ । నందు నిరుగడ వైచిన కుందనంపు
సరులు పూఁబోఁడి చేతులు చాలనరయఁ । గాకయుండిన నీగరగరిక గలదె.

చ. చెలిను రున్ గడున్ దొరయ సేనముతో నెలకొండఁ గల్గిన
ప్వాలిమలయల్లు వానితల వాడని పువ్వయి నిచ్చనేమునీ
నెలఁతుక చేతులన్ బడిన నేలరవంబగు వేల్పుఠాల్పున
ర్మిలినని చేగెనమ్మొగలి రేకులనందగు వాఁడిగోళ్లొగిన్.

గీ. అతివ చన్నులు జక్కవలగుట కేమి । సందియంబింక దండలచాయనిగిడి
రెక్కలై యుండ నొంపుసఁబిక్కటిల్లి । వలిపపయ్యెదయను బిన్ని పెనుదగులు.

క. గరగరికనిచ్చగలుగక । బురుదంగలఁగుటయ కాకపొలుపఱఁగాఁదా
మరమొగ్గలపేరిటితా । మరమొగ్గలుపోలఁగలవె మగువచనుఁగవన్.

క. బంగారుఁ జీవయుంబలె । నంగునఁదగు పొలఁతి మేన నారుదనర్చున్
బొంగారు మెఱుఁగులోపలి । సింగారపు మిసిమిగ్రమ్ము జీరయపోలెన్.

చ. మూసువునఁదమ్మిచూలి మదిముందరెఱింగినయట్లు నేర్పుతోఁ
దరులను పైఁడిబొమ్మలను దా నెతిరఁబునుంచెఁ గాక యే
తెరవున నిల్చు దీనిదగు వ్రేఁకపుగుబ్బల వ్రేఁగునన్ జదల్
దొరసిన యట్టి నెన్నడుము తోరపునల్వ కడంక నొచ్చెలిన్.

క. ఏనయిసూతిప్పయని చె । ప్పిన నేమనవచ్చుఁ జెలియ పిలుఁదుంబలెఁ దా
ననుఁ బ్రోయది యిటువలెఁ గడుఁ । దగ్గుపో కాదనరు దానిఁ దద్దయుఁ గడఁకన్.

క. పలు వెఱఁగుల్ఁ దమనేరుపు । కొలఁదిన్ నెఱజాణలెల్లఁ గొనియాడినని
య్యో నాగ మెఱుఁగుఁ దొడలన్ । దలఁ దైనమననంటి తరహా పోలన్.

క. తలఁకకుమకుని యేకతమునఁ । బలికిన మొఱపెట్టునపుడె పరికింపంగాఁ
బాలఁతుక చిఱుఁదొడలంగా । శిలువోలమిడాఁ గ్రివెఱచి లెక్కింపంగన్?

మ. తమకుంబోలికలైన వేయనుమదిం డాఁ బేళ్లఁ డామల్కతో
నెమకన్ నీళ్లన్ నింగియున్నవన నెంతేనొప్పు నన్ గోళ్లనం
దములై మీటెను తెల్లడాలు గమిలోనన్ గొమ్మమీఁ గాళ్లు చూ
చిమదిన్ జూడఁగ నీనిసాటిగలదే చెప్పంగ నెచ్చోటనున్.

వ. అని యిట్లు నెమ్మది నక్కొమ్మ సోయగంబులు కైవారంబులు సేయుచున్నంత.

సీ. బలుమించు తలమించు నలిమించు సిరిఁ బొల్చు మేచాయ విరుల సంపెఁగలఁ జేయ
నెఱతీరు బలుమాఱు లలిగేరు నెమ్మోము చెలఁగి తమ్ములను దమ్ములను జేయ
జగడాలఁ బగడాల నగుడాలు గలమోవి చెందమ్మి రేకులఁ జివురు సేయఁ
గరము చీఁకటి గప్పు కప్పు వేనలి యొప్పు తేఁటులకొకవింత నీటు సేయ
నలువ జగములఁ గలిగిన పొలుపు గరఁచి । యొంటి వెన్నెల కరువులో నించి యతివ
గాఁ దలంచంగఁ బోలు సకలికనవుర । యనఁగ నటు వచ్చునద్దేవయానఁ గాంచి.

వ. మున్న నెన్నెలంత నెఱింగియు నెఱుంగని వాఁడపోలెఁ జక్కఁదనంబునకు నిక్కయు...
శర్మిష్ఠఁ దెలియవలసి యక్కొమ్మ కిట్లనియె.

క. పలుమాఱు నిందువత్తువు । తొలుత నినుం జూచి యెఱుఁగఁ దొయ్యలి నీకున్
గొలమెయ్యది పేరెయ్యది । యలకొమ్మయు నీవునేమి యగుదురు చావిన్.

వ. అనవుడు.

సీ. మున్ను నన్నెఱుఁగుదు విన్నాతి వృషపర్వుఁ డనుతోలు వేల్పు రాయని కొమార్తె
శర్మిష్ఠ నాఁగ నీచాన నన్నలనాఁడు నీటఁ ద్రొబ్బించిన నెలఁతగాదె
నాటి తప్పునకు నీ ననఁ బోఁడ్లతో నాకు వరవుడైయున్న దీవాలుఁ గంటి
ననుఁ బెండ్లియాడి మన్ననదీని లోను గాఁ గల నెలఁతుక లూడిగములు సేయఁ
గడలిఁ బుట్టిన పొలఁతుకల్ కదిసి కొలువ । వెలయు నల వేయి గన్నుల వేల్పువోలెఁ
బెంపుతో నిచ్చఁ గడతేరు సొంపు మెఱయఁ । బుడమి నాతోడి సవతిగా నడుపవలయు

వ. నావుడు నతండిట్లనియె.

సీ. చెలియా లేచకన్నియల నేలవేలుపుల్ । తగిలి పెండ్లియాడఁదగవు గాక
పుడమినేలవేల్పు ప్రవ్వఁబోఁడులరాజు । తెలమిఁజె డ్లియాడఁ దలఁపఁదగునె.
క. అనిపలుకు ఘాచవేలుపుఁ । గనుఁగొని యిచిఱునగవు మోముఁ గమ్మందమిక్
దనరఁగ నచ్చోఁడియ యి । ట్లనియెన్ మదిలోనఁగోర్కులనయముపొదలన్.
తరల. కడఁగివిన్ను వెలుంగుదాఁ గుతిగాఁగనబ్బలు గానలో
ననడలుచేనన్న ననుంగనుంగొని యప్పుడర్థిలినూతిలో
వెడలఁదీయుచుఁ గేలువట్టితివేకదా యిఁకఁజె డ్లికిం
గడమతెల్లను సొంపులింతియె కాక మీరలెఱుగంరే.
క. చదువులకు నాజ్ఞయిుకడుఁ । బాదలిననాయయ్యపౌత్రప్రుఁగూన్పరిచే
నిదితెగననిపించెదనె । మ్మదిలోపల నీకు నింతమనికతేము న్నన్.
వ. అనవుడు.
క. ఆత్మేని పెండ్లియుచే । పట్టెదనిన్నుడుఁబొంగిపడఁతుకసోఁకుం
బట్టపుటాజ్ఞలనటుకు । నెట్టనఁబిలిపించె నతఁడు నెలదాల్పుబలెన్.
చ. చనుదేరంగనిమింటి మాఁకము నిచ్చల్ పోవు మజ్జారెయా
విను(ద్రోవన్ నడయాడకేల యిటుకున్ విచ్చేసెనోయబ్బురం
బనఁగన్నల్ మిఱుమిట్లుగొల్ప మెయిచాయల్ గాయనీరెండలన్
దనయున్నట్లుగఁ జేరవచ్చునతనిన్ దౌదవ్వులన్ జూచుచున్.
క. వడిఁబుడమితేఁడు వలెవా । టిడుకొన్న పసిండి(వాఁత్ర నెపఁగెడువలువన్
నడుముబిగియించుకొనిమతి । యడుగులపై(వాలిలేచి యతఁడును దానున్.
క. చనుదెంచియిువను(గమ్మెడు । చనుపకములలోనినూవిచక్కెందగు (త్రా
న్ననచప్పరంబులోపలఁ । దనరెడుకప్పూరపుజగతిఁ దమిఘునన్నయెన్.
క. నెమ్మిఁగూరిమి చెలులగు । కొమ్మలువేవురును గొలువఁ(గొమ్మించులలో
నిమ్మగు లేనెయుంబలె । నమ్మెయికినివచ్చి దేవయానకడంకన్.
గీ. (మొక్కిలేచి కేలుమోడ్చుచుఁదనచంద । మెల్లఁజెప్పియయ్యయాతిఁజూపి
తలఁచిచూడమున్నె తగులైతిఁగావునఁ । జెమిటితఁడెనాకు వినుముతండ్రి.
ఉ. ఈవిరిబోఁడి గైకొను మిదేటికిసందియమంచుఁగూరిమిన్
దేవరయానతిచ్చిన మదిన్ దుళికింపుచుఁజెండ్లియాడెనన్
నావలరాజునన్నును దిరంబుగ సొంపునఁజెంపుమీఱఁగాఁ
గావునఁగూఁతుఁగావలసి కాదనకీ చనువియ్యఁగాఁదగున్.

గీ. ఇకనికేయకోమదిలోన నెంచవన్న । నారులకొసంగఁదలంచిన నాకటవినుము
తగినపనియన కెన్నిచందములనైన । నాడలుదొఱఁగుచు నిపుడ నీయడుగులాన.

కం. అనితెగువఁబల్కుకు కూఁతును । గనుఁగొనిమదిలోనఁగూర్మి గడలుకొనంగాఁ
దనరిమతఁడియ్యకొనియె । దనతలఁపునఁగచునిమాట తలపోసివెసన్.

వ. ఇట్లియ్యకొనిరాకాసియొజ్జ తనపజ్జనున్న యయాతిఁజూచి నీకు నిద్దేవయాన
జేకొనవచ్చునని యొడఁబఱిచి యారాజునుంగూఁతును దోడ్కొని వీటికింజను
దెంచునప్పుడు వృషపర్వుండెదురువచ్చి తననగర విడిదిసేయుటయునతండు.

సీ. పదియారువన్నెల బంగారునునుజీని పనిగడియారమ ముప్పరిగగడచి
దురములోఁ దెఱగంటి ద్వారనుగెల్చిన నాఁటి కతలువ్రాసినతొట్టికట్లుదాఁటి
కేరాచపాలఁ గూర్చిన రచ్చపట్టులో రహిఁబాడు పాటల రవలియరసి
తలపురాగనెలసంతన చేసినట్టిపెన్ జగతిపై ముత్యాల చవికెమొనటఁ
దమ్మికెంపులుగట్టిన తావులందు । వారువమునిల్పి తఁ వెంట వచ్చినట్టి
మన్నెవారల ననుపుచు నున్నయెడను । జెంతవృషపర్వుఁడప్పుడు చేరనరిగి.

మ. ప్రాలుపాకప్రపనంట్లు కస్తురిమెక బుల్ మేలిజవ్వాది పి
ల్లులు రాచిల్కలు మానికంబులును జిల్గుల్ మంచి ముత్యాలు పే
రులు మేల్ బోగపుఁరేఁబెనుముల్ పసిఁడితేరుల్ పల్లకుల్ లోనుగా
నలుపా చేసె యయాతికిందలఁపులోనుప్పొంగుచుంగూర్మితోన్.

వ. మఱియును.

సీ. జేజేలదొరప్రోలు చెఱవట్టితెచ్చిన పాలివొసియచ్చర పువ్వుఁబోండ్లఁ
దామరచెలిపట్టి తావుగొల్లాడఁగాఁ దగులుపడ్డట్టి యేనుఁగులగముల
ననిగెల్చినీటిరాయనివీడుచూఱాడి వ్రాలికైకొన్నట్టి వారువములు
నిగుడిజక్కులతేనే నేలవెల్లదోచఁగాఁగలిగినవేల్పురాకంటు సరులు
కోట్లకొలఁదులు బంగారుకొలువుసాల । ముంగలనునిల్పి మదిలోనఁ జెంగలించి
చేరికానుకచేసినఁజిత్తగించి । యడుగరలనంబవృషపర్వువిడిదికనిపి.

క. తేజీడిగితనయంతటి । రాజులుమేలప్పయనుచు రాఁగాఁజనితాఁ
దేజనను మేడలోపలి । జాజులచప్పరములో నెసంగుచునుండెన్.

గీ. అంతరక్కసిమొజ్జ ధ్వానానతిచ్చి । పంపవృషపర్వుఁడప్పుడు సొంపుమీఱఁ
బలుదెఱంగులఁ దనపారుపత్యకాంద్ర । చెలువుమీఱంగ వీడెపైనేయఁ బనుపఁ

మ. అలవలరాజుచేతి యలరమ్ములనందగుతేమి చెల్వపుం
బాలకతులమోముఁ దామరలఁబోలనిసిగ్గునవీఁగిపెక్కురా

బంగారుబిందెలఁబన్నీరుగుల్కుచు జలకమార్చిరి కొందఱలరుఁబోండ్లు
వలిపహోవడఁదలయొత్తెఁ జెలియొకర్తు । కదిసి చెంగావిసువ్వల్వఁగట్టెనొకతె
నెఱులు నేర్పునఁ దడియార్చె నెలఁతయోర్తు । చెంగిజాజులు వేనలిఁ జెరివెనొకతె

సీ. మట్టెలు పిల్లాండ్లు మటెవీరమద్దియ లెలమిఁ దొడిగెఁ దొయ్యలియొకర్తు
గంటల మొలనూలు కడిఁదియొడ్డాణంబు నుంగరంబులు వెట్టె నువిదయోర్తు
ముత్యాలపేర్లు మొగపుఁదీఁగెయు బన్నసరములు గీలించె జాణయోర్తు
పచ్చలకడియముల్ బంగారుగాజులుఁ బదకముల్ సవరించె ముదితయోర్తు
తమ్మికెంపుల పంజులకమ్మదోయి । చేరుచుక్కయు నుంగరచెవులపువ్వులు
బవిరలును గొప్పవలయును బడఁతియోర్తు । దిద్దెఁ గస్తురి నామంబు దీర్చెనోర్తు

క. పోలఁతి మొగముఁబోలుదునని । మలయంగా నిండుఁ జందమామను వడిఁదొ
య్యాలికడకుఁబట్టి తెచ్చెనో । యలరుచు ననఁ నొకతె నిలువుటద్దము నిలిపెన్.

క. కారుమెఱుంగన మరుడే । వేరియుఁ బానఁగఁ బైఁడి పిడిదండన బం
గారపుబొమ్మఁగాసిం । గారంబున దేవయానికడుఁ జెలువొందెన్.

వ. అంతనక్కడ.

సీ. పచ్చలపని నొప్పు పైఁడిముక్కాలిపీట యిడియె వేడుకతోడ నింతియొకతె
కైదండలిచ్చి రాకలువరాయనిఁ దెచ్చి యందుమీఁదటనుంచె నతివయోర్తు
సవతెచ్చటను లేని చొక్కటుపొంగులు తిగిచెఁగొల్కులెడల్చి మగువయోర్తు
కడుమించు డాకేలగండపెండేరంబు మెల్లన వదలించె మెలఁతయొకతె
పచ్చిసికజాజిసరములు విచ్చెనొకతె । కంటసరులును ముత్యాలకడియములును
బదకములులోనుగాఁగలబలుపసొమ్ము । లొయ్యనొయ్యన సడలించె నువిదయోర్తు.

క. నెలవంటి మొగము చెమ్మట । మొలకలఁదగఁ గొనువణఁక ముంగురులాడన్
దలయంటెనొకతె తేటఁకిఁ । గలపంబునఁ జేసితావిగట్టిన నూనెన్.

క. సరిచేతోడవులు మ్రోయఁగ । సరగ నెఱులు దువ్వి దువ్వి సరసందముగా
సిరిగంధపు టటుకలియిడె । విరిబోఁడియొకర్తు రాచవేలుపుదొరకున్.

చ. జలకములందు లేవనుచు సందియ మొప్పఁగ నూరకున్నఁ బై
దలినిగికాకికన్ నగుచుఁ దామరకంటియొకర్తు తేటవె
న్నెల పటికంపుబిందియల నించిన గొజ్జఁగి ప్రావునీటిచేఁ
దలగడిగెన్ యయాతికి నెద్దంగడు సంతసముల్లసిల్లఁగన్.

వ. అప్పుడు.

క. ఏలనాఁగరొకతె దలిమపు । వలిపంబులు గట్టనిచ్చె వడినడుగులఁ బా
వలు దొడిగెనొకతె యొక్కతె । తలఁబావడ యొత్తి తిగిచి తడియార్చెదగన్.

సీ. నిలువుటద్దంబాక నెలఁత చూపఁగ నోర్తు క్రొన్నెలనామంబు గోరఁ దీర్చెఁ
గలికి యొక్కతె రావి కల్వరాయని మేనఁ గలపంబు చేసిన గంధమలఁదెఁ
జాన యొక్కర్తు కచ్చను పకంబుల సరుల్ చింగులు వారఁగ సికనమర్చెఁ
జెలువ యొక్కతె గప్పెఁ గిలికి రాయంచచు బంగారు చెఱఁగుల పచ్చడంబు
పరగ వెలలేని చౌకట్లు బన్నసరులఁ । బసిమి నాప్పారు పచ్చల పతకములును
గండపెండేరములులోను గాఁగఁ గలుగు । సొమ్ములొకయింతి గైసేసె సొంపు మెఱయ.

క. ఎడలేదు లగనమనుచున్ । బడిబడిఁ బిలువంగ నపుడు బలువాయిదముల్
గడలు కొనంగా నచ్చర । పడఁతుల దవళములు పెండ్లిపాటలు సెలఁగన్.

క. చెలి యేనుఁగు పైఁ బన్నిన । యలరంజప్పరములోన నతివలు వీచో
పులు పీవతేఁడు రెండవ । వలరాయని పగిది వచ్చి వాకిటు దిగియెన్.

గీ. కలికి యొక్కతె మగమానికముల గిండి । నించి పన్నీరు వోయఁగా నేల తేని
యడుగుఁదమ్ములు గడిగెఁ దొయ్యలి యొకర్తు । తుడిచె నెలగావి పయ్యెద తుదఁ జెల్లఁగి.

ఉ. కారుమెఱుంగులం దెగడు కైపున నొప్పు నెలంతలంత బం
గారపుఁ బళ్లెరంబులవగన్ నునుముత్తెపు ముగ్గులోన నిం
పారెడు కెంపుదివ్వియల నందపుఁ గెందొడవుల్ చెలంగఁగా
న్నారతులిచ్చి రప్పుడు యయాతికి లేనగవొప్పఁ గర్మిలిన్.

ఉ. తామర కెంపులంతటను దాచిన ముక్కలి పీటమీఁదటన్
గోమలులంతఁ బెండ్లికొడుకుం దగనుంచినఁ బొల్పుమీఱఁగా
బ్రామినుకుం దెఱంగునను రక్కసియొజ్జ యొసంగెఁ గూఁతునున్
గోమునఁ బెంచుకోర్కి సమకూరుటకుం దనయాస మెచ్చఁగన్.

సీ. అలనాఁడు జగములు గెలిపించినను మెచ్చి తారకుం డిచ్చిన వారువంబు
కని పైఁడి కంటిరె రాకాసి తేఁడిచ్చిన పాపమేపుడు పచ్చ పతకములును
శివితోఁ గొడుకు పెండ్లికిఁ బిల్వనరుదెంచి బలి తెచ్చి యిచ్చిన బన్నసరము
తనకు వేలుపుతేఁడు తలఁకి కానుక సేయ వృషపర్వుఁ డిచ్చిన వెలఁది పిండు
నేమి సేయించునోయని యొదఁగలంగి । కడలి యంపిన బల్లు మానిక్యములు మఱియు
మామ యల్లునకిచ్చె నగారాన మెఱయ । హెచ్చు సొంపునఁ గూఁతును నిచ్చునపుడు.

వ. అంత్తనిట్లు కావించి తెరమఱుంగున నప్పడమి తేని నునిచిన నుచితముం దనకూఁతుం
దోడి తేర శుక్రుం డనుపనుచుటయు.

సీ. అఱుఁగుఁదమ్ముల చాయ పుడమి యొత్తకయుండఁ జిగురుమించిన తీవఁ జెలువమమర
ముదితయొకర్తు పయ్యెదచెఱంగున సారె చెక్కుటద్దంబుల చెమటదుడువ
మోమువంపఁగ జాఱు ముత్యాలపాపట సకియొర్తు పలుమాఱు చక్కనిడఁగ
వాలిచ్చఁ గప్పుపల్వరుస చీఁకటిగ్రమ్మ మఱియొర్తు తెలనాకు మడిచి యొసఁగఁ
గలికి కన్నుల చూపులు గ్రమ్మికొనుచు । నగుడఁ బటికంపుటాకట్టు నేలయుల్ల
నలరు కస్తురి నాటిన యట్లు గాఁగ । దెలివిఁ జఱుందెంచెఁ గడునాన దేవయాన.

వ. ఇట్లువచ్చిన తెఱవం దెరవమఱుంగున నిడి తగు తెఱఁగులు గావించిన పిదప నత్తెర
దిగిచిన సమయంబున.

గీ. తాళిగట్టెప్పుడె తలిరాకుబోఁడికిఁ । బుడమితేఁడు వేడ్కఁ గడలుకొనఁగఁ
దనరు పెక్కువాయిదమ్ముల మ్రోఁతలు । చెలఁగి మూజ్జగములు చెవుడుపఱుప.

క. చెలియొకతె యెత్తిపట్టినఁ । దలిరాకుంబోఁడి తేనితలముత్తియప్రం
దలఁబ్రాలువోసిన తుదన్ । నెలఁతుక తలఁబ్రాలువోసె నేర్పదలిర్పన్.

మ. నలిఁగెందమ్ముల చాయ కెంపులబలెన్ రంజిల్లు నమ్ముత్తియం
బులు రాపాడుచు దోయిలింపుచును మోముం జంకురన్ నవ్వువె
న్నెల లల్లల్లన సోఁకఁగా నుమిగులన్ నిక్కంగ నాకున్నుడిన్.
దలఁబ్రాల్ వోసె నెలంత రాచనెలకున్ దార్కొన్న కోర్కిందగన్.

గీ. మించుమీఁది పెద్ద మంచుతుంపరలన । మగువ వేనిమీఁద దిగఁగ జాఱ
నలరి పుడమి తేఁడు నాఁదలఁదగు ముత్తి । యంపుఁ బ్రాలు నించె సొంపుమెఱయ.

క. పోల్పఁ నొలి మిన్కు తెఱఁగున । వేల్పించిన పిదప రాచవిరివింటి దొరన్
వేల్పులకున్ మ్రొక్కించిరి । పాల్పడి యల పెండ్లికూఁతునజ్జనకడఁకన్.

క. తగఁ బ్రాకెన యును దీటించి । నగవుల పనులైన వెనుక నాలవనాఁడో
ప్పుగ నాగవల్లి సేయఁగఁ । బగడవు టుప్పరిగలోనఁ బడఁతుక లెల్లన్.

సీ. చెలఁగుచు మంచిపచ్చలు దెచ్చి మేళ్చి దట్టుబుగాఁ గ్రుచ్చి తాచితాచి
వెన్నెలల్ వెదచల్లు వెండిముత్తియములు నేర్పుతోఁ గ్రేవల నించి సంచి
యచటెల్లబలుగావి నద్దినట్లుగఁ జేయు నెఱిమించు కెంపుల నెఱపి నెఱపి
చెంతది వ్వెలఁబోని చీఁకట్లు వెదచల్లు తెఱఁగంటిరాజ్జాలఁదీర్చి తీర్చి
రమణమీఱఁగ గోమేదికములు చాలఁ । జెలువ మొప్పారనంచులఁ జేర్చిజేర్చి
కొలఁకునైదువ చిలుకలకొలుకులపుడు । పొలుపుదీర్చిరి మదిలోనఁ బ్రొదలు తమిని.

మ. చెలి చన్నుంగవ బోలఁ జాలుననుచున్ జెందమ్మి పూమొగ్గలన్
జెలువల్ కిన్కనుఁ గట్టివేసిరనఁ గాఁ జెన్నొందుచున్నాల్గువం

క. మగఁడేకోలఁదినినదపినఁ । దగనట్లేననీకుకోలఁది తామరవైరే
వగిదిన్ నడచెదవో నీ । దగునేరుపు చూతమింక నలరుంబోఁడీ.

క. మగఁడేడుగడయు దేవర । మగువకు వేఱొండు లేదు మతిగావున న
మ్మగఁడోగిరంబు గుడువక । తగదింటికి నారగింపఁ దన నెట్టియెడన్.

చ. కినియక యర్థిలిన్ మగనికెందగులైన యనుంగులేగుదెంచి
చినఁ గడుఁ బెంపు సేయఁదగుఁ జెచ్చెర నెమ్మది సంతసిల్లుచున్
దనబలఁగంబు నన్నలును దమ్ములు లోనుగ వచ్చిరేని యున్
బెనిమిటి పుంప్రు పెంపునను. బ్రేముడిఁ జేయుట పాడి చెల్వకున్.

క. చొచ్చినయింటికిఁదగని । న్నిచ్చినయింటికెనివన్నెయే చందమునన్
దెచ్చెదవో చూచెదఁగా । నిచ్చలు మనవంగడంబు నెన్నంబొగడన్.

గీ. వినుము మగఁడేరి నేనియు మనుపఁగోరు
నలుగునట్లనె చెలువయుఁదలఁపవలయు
నన్న తమ్ముఁడు తండ్రి మామనుచుఁగూర్మి
నొంటిపాటునఁగూడి కూర్చుండఁ దగదు.

క. ఆవెన్నుఁడు లచ్చియుబలె । దేవియు దేవరయుఁబోలెఁ దెలివిబలిర్పన్
నీవును మగఁడును బావుం । డాటియనంగూడి మనుఁడు తరల నికూర్మిన్.

చ. పెనిమిటి దండు దాడిఁజని పెంపునఁ గ్రమ్మఱు దాఁక పీడియం
బును సిరిగందమున్ విరులు ముట్టకయుండఁదగున్ బాలంతి తే
జునఁగడు నొప్పు మట్టుసపు సొమ్ములతోఁ గులు మాపుచీరతోఁ
దనకలికొప్పుతో మిగులఁ దార్కొను ముత్తైపు సేసబొట్టుతోన్.

సీ. ఇది వేల్పురాయని యనుఁగు నెచ్చెలి సుమీ బత్తితోఁ గూర్చుకవత్తుగాని
ప్రొద్దుపట్టికి నిది బోనకత్తియ సుమీ ప్రోదితో డుత నడపుదువుగాని
పైదలి యది గాడ్పు దాదికూఁతురు సుమీ కూర్మి యొప్పంగ సాఁకుదువుగాని
యది పైఁడిదొరరాణి యఁనుగుఁ జెల్లెలు సుమీ యువిద గారవము సేయుదువు గాని
యనుచు శర్మిష్ఠ యాడిగంబమరఁ జేయు । నలరుఁబోండ్లను వేర్వేఱ నప్పగించి
చెంతఁ దలవంచుకొని తన చెలుల నడుమ । విన్నవైయున్న రక్కసికన్నెఁ జూపి.

క. ఇది పుట్టుబోగి దీనికిఁ । గొదవేమియు లేకయుండఁ గూర్చుకరమ్మీ
చెదరఁగఁ జూడక నీవలె । ముదితా కటముఁగూడ నీళ్లు మొదలగు నెడలన్.

వ. అని పెక్కుచందంబులం గూఁతునకుం జెప్పి పయనంబు సేయుటయును.

చ. దళముగఁ గల్వఱేకులతుదన్ దిగజాఱుమంచునట్లు కన్
గొలుకులడిగ్గ సిరుగని గుండె దిగుల్గనఁ దల్లి యిట్లనున్
జెఱువను గేలుపమ్ములను జెక్కులు నొక్కుచుఁ గౌఁగిలించుచున్
పెలపెఱవాఱు మోముపయి విన్నదనంబు నొలంకుచుండఁగన్.

క. ఉల్లమున తగవ సేటికి । నెల్లుఁడియ పిల్లనంపనే తెఱచెదు నా
తల్లి విగద నీతమ్ముఁడు । వల్లికయున్ దోడు రాఁగ మదినడలేలా.

ఉ. లచ్చియయురూపు వఙ్గడము లావురాచటికంబు గౌరవం
జెచ్చుగఁ గల్గి యిజ్జగము నేలెడు పెన్మిటిఁ జెంది తర్పిలిన్
బచ్చిలు సొంపుతోడ నినుఁ బెంచిన మచ్చికఁ బాయలేక కా
నొచ్చెను తేసగా తలఁపనొక్కటియుంగన నీ తెఱంగునన్.

గీ. అనుచు గారవించి యనుఁగుఁగూఁతును దోడు। కొనుచుఁ జెలులుఁ దాను గొంత దవ్వు
వచ్చి యంత నిల్చి పచ్చలపల్లకి । లోనఁ గొమ్మనుంచి మేను నిమిరి.

క. ఉంపుమనుమమ్మ క్రమ్మతి । పొఁడను నీ చెలులఁ దోడఁబుట్టువులగు నీ
చండునిమాఱుక్కని ననుపుచు । నిండుగఁదగనుండు నీవు నీ పెనిమిటితోన్.

క. అని పల్కి కూఁతుర్నంపిరఁ । జని యెన్ శుక్రుని పొలంతి చానలుఁ దానున్
నను పైఁడిగాలి చెఱఁగులఁ । బను పడియుడి జీనితోడి పల్లకి గదలన్.

వ. ఇట్లు గదలుటయు శుక్రుండు వెంటనరిగి యటముస్సు వెడలి పీడు విడిసియున్న యయా
తిం గనుంగొని యిట్లనియె.

క. ఏదియు నెఱుఁగదు ప్రోదిన్ । బోదునఁ బెరిగినది పేఁడమొన్నటి దినుమీ
పైదలి నేరము గలిగినఁ । గాదని తెలుపు సవు గాని కడునలుగకుమీ.

వ. అని యప్పగించిన శర్మిష్ఠం జూపి యిట్లనియె.

క. చెలువున వృషపర్వుండను । బలియుని గారాపుఁబట్టి పసిబిడ్డసుమీ
వలరాచపనులు వెలిగాఁ । గలిగిన సొంపుల నడపఁగాఁ దగు దీనిన్.

వ. అని చెప్పి యతండు సేయు గారవంబున సంతసిల్లి.

చ. పుడమిని గల్గుతేండ్లు తగఁబూనికఁ గానుకలిచ్చి నిచ్చ నీ
యడుగుల వ్రాలఁగా జగములన్నియు నేలుచు వెండి పైఁడియుం
గొడుకులుఁ గూఁతులుం గలిగి గుజ్జును లేని కపిందు పల్లకిన్
గొడుగులు నిప్పొటిల్లఁగను గూరిమితో మను పెక్కుతేండ్లొగిన్.

మ. అని దీవింపుచు శుక్రుఁడంతటను నెయ్యంబొప్పఁగాఁ గ్రమ్మఱన్
జనియెన్ రాజును బేరులుం గడిఁది నిస్సానంబులున్ మ్రోయగాఁ

గన్నుదెసన్ గల బలువాయిదంబులు చెంగన్ వీసుచేరంగ నం
తను వానం గలవారలెల్లఁ గడఁకల్ దైవార నొక్కుమ్మడిన్.

క. కలపడగలెత్తి కస్తురి । కలయంపులు చల్లి యాణిగల ముత్తెపుమ్రు
గ్గులు వెట్టి వీది వీదులఁ । గలయంగా మేలుకట్లు గట్టిరి వేడ్కన్.

చ. అరుదటు చూడఁగా నమరె నందులఁ గ్రందుగఁగుందనంపుఁ బెన్
గురుఁజులమీఁదఁ దార్కొనిన క్రొత్తగు పుత్తడిబొమ్మలెల్లెడన్
సొరిదిని తేఁసోబనపు సొంపు గనుంగొన వచ్చినట్టి య
చ్చర పువుఁబోఁడ్ల చందమునఁ జక్కఁదనంబుల సొంపు పెంపునన్.

సీ. ఎడలేక యుండంగ నిడిన దోరణములు పెల్లు పైఁ బడెడు కరుళ్ళుగాఁగఁ
దళుచుగాఁ బెట్టిన తావి దూపపుఁ బొగల్ గుంపులై మెలఁగు మొగుళ్ళుగాఁగ
గములైన కటిమాణికముల మేడలు లోనఁగలఁగిడాఁగినయట్టి మలలు గాఁగ
నెల్లప్పుడును బిక్కటిల్లు బేరుల మ్రోఁత రహిమించు తరఁగలరవలి గాఁగ
మేలిపటికంపుగోడల డాలు చాలఁ । బెంపుతోఁ బర్వు తెలినీటిసొంపుగాఁగఁ
బాడమిల్లోపల వేటొండు కడలివోలె । నెసఁగు నవ్వీడు సిరిపుట్టినిల్లు గాఁగ.

ఉ. మంది గుఱాలు నేనుఁగులు మావుతులున్ దొరలెన్నఁ బెక్కురై
క్రందుగఁగూర్మితో నెదురుగాఁ జనిపోఁజులు దీర్పఁ జూచుచున్
గొందలు ముందఱన్ బయిఁడి గోలల హొగ్గళు లెచ్చరింపఁగా
నిందని యామచేఁబోదలు నేనుఁగు నెక్కి మదిం జెలంగుచున్.

వ. వీడుచొచ్చి యారాజు రాచవీదిం జనునప్పుడు.

ఉ. చూడఁగ నేగుదెంచి కడుఁజుక్కల తోడుత రాయ ముత్తెపున్
మేడల మీఁది కెక్కి యుల మేనకఁ గ్రేణి యొనర్చు బ్రాయపుం
జేడియ లబ్బురంబయిన చెంగలువల్ తగఁజల్లి రందఱున్
వేడుకతోడ రాకలువ విందుపయిన్ మదిఁగూర్మి లెచ్చఁగన్.

క. అంతట నాగసరంబుల । నింతులు తానములు మిగుల హెచ్చింపుచు సా
మంతము పరవన్ బువులు వ । సంతములో నుగనుగొనుచుఁ జనుదేమఱియున్.

సీ. వేలుపు పూఁబోండ్ల గేలిసేయు నాయారి చెలువలు దగవీరమలహారియును
గ్రొక్కాఱు మెఱుఁగులు కన్న సుక్కఁగాఁ జేయు వెల్లఁదుకల్ బింగారు వీరణములు
వలరాజు పెంచినచిలుకలవలెఁ జాలఁబెంపొందు నెలఁతుకల్ పిల్లగోళ్ళు
పూఁదీఁగెలోయనఁ బాలుపొందుపడఁతుకల్ పెల్లుగాఁ బైఁడి తప్పెటలువఱియు

గలిగినవిశెమెల్ల నేర్పుతోఁ దలిరుఁబోండ్లు । కడఁగి క్రేంయింప హొగ్గడి కత్తెరిది
పైఁడికోలలుపూని వేపడఁడటంచుఁ । బల్లకీ ముందఱను బరాబరులు సేయ.

వ. అరుదెంచెం.

క. ఆదట నేనుఁగు డిగి తన । పైదలియుజ దానుఁబైఁడి పల్లకులమ
త్తెరువ లారతులీఁగాఁ । బ్రోదిజ దన నగరు సొచ్చెఁ బూనికమెఱయజ.

వ. అనెవ్వుడునటమీఁది తెఱంగెట్లుండెనని యడుగుటయు.

ఉ. లాలస రీగజాంకుశ తలంపులసొంపుల తమ్మిచూలి యు
న్నేలయు నింగి పట్టముగ నిండ నమర్చిన నీయసంబుచేఁ
గాలిమెసంగుతేని యొడికంబును జుక్కల సోయగంబు మ
త్యాలి చెఱంగు డిగ్గపడునట్లుగఁజేసిన చాగపుంబలీ.

క. శాలఁతులకు మేటిపగఱకుఁ । దలఁపులలో నుండు చక్కఁదనమునఁ గడుఁ జే
బలువు గడంకల నెన్నం । గల జాణల రాయ మేనుగలవల రాయా.

బంధురవృత్తము. అని మొనసెదిరెడు బలుపగఱర మూఁకను కడలింగని యేనికపోఁ
జని చెడు పఱపగునల తఱిమలచేతందగఁ ద్రచ్చి మెలంకువ సం
తన కలిగిన గెలుపులసిరి నెఁతజ దక్కంగైకొని యాయకతో
నెనరుగ నసపుంగలువల సైదోడ్నటుగఁ గూర్చిన నేరుపరీ.

గద్య. ఇది శ్రీమదన గోపాల మంత్రప్రసాద లబ్ధసారస్వత సుకవిజనహితవచో
విభవ భావనామాత్య తనూభవ పొన్నికంటివంశవర్య తెలగనార్య ప్రణీ
తంబైన యయాతిచరిత్రంబను నచ్చతెనుంగుకబ్బంబునందుఁజతుర్థాశ్వాసము.

---

## పంచమాశ్వాసము.

---

క. సిరి రాచవేల్ప కడునీ । వరితనమున నీటిదాల్ప వలమురి సుడిహ
ల్దారవంటియొప్పుగల డే । వారజాణ యమీనుఖాన వలపులతేఁడా.

వ. అటమీఁది తెఱంగు వినుండిట్లుయయాతి దేవయానం బెండ్లియై వఱలు సిరులతో
నుండునంత నక్కన్నియందలిమం బెక్కుంపందలంచి తలిరుంబోండ్లు.

సీ. నలవిన్నెచినఁ జాలనలరు కప్రపుఁబావి పొలుపొంను నెమ్మేన బుగులుకొనఁగ
వేనలిఁధురిమినా విరి సరంబుల సొంపు లలమితేఁటుల నెల్ల నామతింపఁ
వెలివి కట్టాణిముత్తెముల పేరుల రంగుకలిమి పాలిఁడ్ల వెన్నెలలు గాయ
వలపుల చిఱునవ్వు కలయఁబూఁజాలుఁగా ముద్దుఁజెక్కులమీఁద మొలక లెత్త

మోముఁదామరయింపైన మురువుతోడఁ । జెలువమగు తియ్యదేనియ చేతనసుర
మహన్ని యాజవ తూపునాఁ బరఁగునట్టి । దేవయానఁ గనుంగొని తీవిఁ గదిసి.

సీ. బంగారు కుండలఁ బగటు నీగబ్బిగుబ్బల మీఁద నొకమేలు గలుగునేఁడు
జగడాలఁ బగడాలఁ దెగడు నీమోవికిఁ బాలుపైన యొకడాలు గలుగు నేఁడు
మెఱుగుచేఁ గ్రొమ్మించు మించు నీమేనికి నలరింప నొకయింపు గలుగు నేఁడు
తళుక్కులై ముద్దులు గుల్కు నీచెక్కుల కెలమిగా నొకసొంపు గలుగు నేఁడు
తాళుకో ప్రొద్దు గ్రుంకిన దాఁక ననుచుఁ । బలుకఁ దనలోని కూరిమి బయలు పడఁగ
నీక కన్నుల జంకించి యేమొగాఁ జగు । దేవయానఁ గనుంగొని తెఱవ యొకతె.

క. కనిమది గలిగిన తీరున । నినుమగని ప్రాసికొన్న నిలువుఁ బ్రతిమలన్
గనుఁగొని యెలుఁగక వలికిన । ననబోఁడింగినియఁ దగునె నవలా నీకున్.

గీ. మగువ యొన్నఁడు సిగ్గున మగనిఁ జూడ । నట్టిగోలపు నిన్నన నగునె నైన
విదియనాఁ డేను పడకున్నఁ దదియనాఁడు । కానఁబడిరా యెసు పః కింతకన నేల.

వ. అనినగుచుం బలుకునంత.

క. అతిముతిని గ్రుంకుమలపై । నెఱసంజను గ్రమ్మినట్టి యొరవలి నెగబ
ట్టెఱమినఁ జనివడి గ్రుంకెన్ । బఱపున ననఁ బ్రొద్దు గ్రుంకెఁ బడమటి కడలిన్.

వ. అప్పుడు.

గీ. మెలఁత మగమానికంబుల మేడలోన । నెత్తమాడుచు దమదెమ్మ నీవటంచుఁ
గూర్మికై దండయొసఁగి తోడ్కొనుచుఁ బోయి । చనుపకంబులనొప్పు శుచవికయ్యెదు.

సీ. పలుకులఁ దేనియల్ గులుకఁ గోకొక్కకంబు చెలఁగి రాఁజేయు రాచిలుకగములు
నలరిపీనుల పండువులు గాఁగ వలరాచ ప్రామిన్కు లాగి నేర్చు పారువములు
నలరుల విలుకాని గెలుపుఁ గబ్బంబులఁ జదివెడు గోరువంక కొదమ పదుపు
వినఁగూడ మరుని దేవేరిపైఁ బాటలు వాడు లేఁబాయంపు బరితములును
గవిగి పూదేరురా యని కొలువు నేవు । పగిది నొప్పారు పసిఁడి యుప్పరిగలోనఁ
గెంపు నెఱమానికంపు వాకిటికి వచ్చి । తమ్మిరేకుల పలకల తలుపు దిగువ.

చ. బాగడలసాన రాచిలుక పుత్తడి పావలు తావి దూపపుం
బాగలు జవాది వంక తెలిమత్తెపుఁ జిప్ప పసిండి గిండియుం
బగడపుఁ గోళ్ళమంచము జమల్పఁపుం గపురంపుఱ దిన్నె వెం
పుగముల జాలి పల్లికయుఁ బువ్వులు మించుల నిల్వటద్దముల్.

గీ. కలిగి యొప్పారు నందు బంగారు కోళ్ళఁ । దూఁగుమంచము పై వేల్పు దొరయ షో.లె
సొంపు పెంపున మిక్కిలి సోయగంబు । నలరఁ జెలువారెసుచున్న యయాతిఁ జూచి.

చ. నను మునువేడంక సిబ్బితిగ నంబడ విప్పగు గొప్ప కప్పు క్రొ
మ్ముడి విడిజాఱ నందియల మ్రోఁతకుఁ దోడుగఁ దమ్మికెంపు పెన్
గొడవుల మ్రోవఁ బయ్యెద చఱంగవ చక్కనొకింత చూపఁ గా
వడిమగుడంగ నేగుచెలువంగని నవ్వుచు నింతులింపునన్.

క. ననబోఁడి యోర్తు కూడిన్ । జని కేలుదెమల్చి పట్టిచను నే నీకున్
దనిమిటినిఁ జూచి క్రమ్మఱఁ । జెనఁగక చను డెమ్మటంచుఁ జేర్కొని తిగువన్.

గీ. తెలివ యొకర్తు నాలు విదిర్చి వైచి । కేలగంబంబు పట్టి జంకించి పెనఁగ
వెలఁది మన్మేల వెట్టి నవ్వించ నీకు । బయిటికెత్తిన దివ్వె నీదన్ఘున నడక.

క. తక్కినకన్నెలవలె నీ । వెక్కడ బూటకము సేయ నేటికి నీకున్
మ్రొక్కెద నిఁకఁ బెనఁగకు నా । యక్కవు గద రమ్మటంచు నడుగులఁ బడియెన్.

చ. నినిచిన సిబ్బితిం దఱిమి నెమ్మది చేరి మరందు నొంప నో
ర్పనిపని గట్టి పట్టి చెలి రమ్మని కేలు దెమల్చి తివ్వగాఁ
జఱయెఁ బెనంగుచున్ మఱియు సన్నలవచ్చెదఁ గాని మించి పో
మ్మనియు బెదంకియున్ మగుడి యంతట నింతట నిల్చిలాగుచున్.

వ. ఇట్లు వచ్చిన సందోడ్కొని చని నెచ్చెలి యచ్చెల్వం జూపి రాజునకిట్లనియె.

క. మును పెంత కూర్మి గల్గిన । ననబోఁడికి నిట్టియెడల నానయ తగుఁ గా
వ్యూహమగున తగవు నడిపెన్ । గనుఁగొనుఁడీ మీరలొండు గాఁ దలఁపకుఁడీ.

వ. అని విన్నవించి యామించుబోఁడి నారాతేని పాన్పుఁ జేర్చెనంత.

సీ. చిలుకకుఁ జదువు రాఁ జెప్ప లేదా యేఁ గా యనుచు వేగిరపడి చని యొకర్తె
నెమ్మి నేమయ్యెనో నేఁడాటఁగ అపక యరుగు చెంచితినని సురిగె నొకర్తె
యోపగా కునన మేఁత యిడనైతిఁ గా ప్రోదిగొరువంకకనుచుఁ దానరిగె నొకర్తె
నడ నేర్ప లేదా యె నను పురాయంచకుఁ దడవయ్యె ననుచుఁ దాఁ దారెనొకర్తె
తనను కనుసన్న తేనికిఁ దలిరుబోఁడి । నలముకొమ్మని చూపుచుఁ దలఁగెనొకర్తె
విడెముఁ జేవైచి తివని యొక్క వెలఁది దిట్టి । ప్రాణియమ్మేడ వెలికిని బోయెనొకర్తె.

వ. అంత.

క. నను నేఁడుఁ గని గోలవు బలె । ననయము నిట్లనఁగి పెనఁకి యలతితివిగదా
యని మేనత్తెయు నిమురుచు । ననబోఁడిన్ గారవించె ననలెత్తుతమిన్.

చ. పనుపడు కూర్మి నొక్కొక సెపంబునఁ జెక్కులు గొప్ప గుబ్బలున్
గనుఁగవ యంటి సిబ్బితిఁ దగన్ దొలగింపుచుఁ బాన్పుఁ జేర్చి నే

ర్పినఁ జెలిఁగౌఁగిటన్ బాదివి పొందెఁగడుం గడు సేదఁదీర్చుచున్
ననవిలుకాఁడు సంతసమునం దనపూనిక యొప్పటుకుబ్బఁగన్.

సీ. పుక్కిళ్ళవిడిబియంబు లక్కప్పురపుఁ దావిఁ బాదలెడు సన్నయూర్పులు సెలంగఁ
గౌఁగిళ్ళ బిగ్గరఁ గదియించి మేనుల నిరువుర చేతుల నెలమినలమఁ
దలిరుపైఁ దెంపులు దాచిన చందాన మునిపళ్ళనొక్కిల మోవులలరఁ
జెలఁగి పెనంగఁగూర్చిన శ్రోవ్విరులు జాతి చిక్కనకొప్పునఁ జిన్నెలమరఁ
గ్రమ్ము చెమరున నొక కొంత గరఁగి నెఱసి। బుగులుకొన్నిజాలు కస్తురి బొట్టుదనర
నిగురమంపున్నఁ దగిలిరన్నెలతేఁడుఁ। బడఁతియును నంతవలరాచపనులనలసి.

వ. అప్పుడు.

చ. తెలతెలవాటెనన్ దొరల దేవర తామరకంటివాతెఱన్
బలుమొనలొత్తి మేల్కొలుపఁ బైదలి గేస్తుని మోము చెక్కుచే
నలముచుఁ జేత నవ్వలువ నంత మొలన్ సవరించి లేచి తా
నలయక వీడెమిచ్చె నతఁ డప్పటి కప్పని పైఁదలంపిడన్.

వ. ఇట్లు వీడెంబొసంగి క్రమ్మఱ నారాచకొమరు కోర్కి దీర్చి నేర్చు తమినలరునంత.

చ. పెనిమిటి రైయిన వెన్నుఁడొగిఁ బ్రేముడి నిచ్చినఁ బుట్టుగ్రుడకగ
ట్లను తన రెండు చేతుల నొయ్యారము మీఱఁగ నేల కొమ్మ దా
ల్చిన పవడంపుఁ జుట్టలుఁ గుఁజిందమునుంబలెఁ జూడనొప్పెనం
తనుదగఁ దూర్పునన్ పెనుకఁ దమ్ముఁ విందును జందమామయున్.

వ. అప్పుడప్పడంతి యొప్పులకుప్పయగు పసిండి యప్పరిగలోనికిం జని తగుపనులు
గావించి యున్నంతం జెలులు వచ్చి.

గీ. రహిని పాలపురిరాయని రాచలచ్చి। కరణి నొకవింత యగుసోయగమున మెఱయు
నిన్నుఁ గనుఁగొనఁగాఁ గల్గెఁ గన్నులారఁ। గోర్కెల్లను మాకుఁ జేకూడెనేఁడు.

వ. అని పలుకం గినుకం బలెజంకించు దేవయానంగని యొక్కతొయ్యలి యిట్లనియె.

సీ. అదలించితివి కొమ్మ నదియే మెఱుంగుఁ బయ్యెదజాఱనీకవే య్యిగురుబోఁడి
యెఱుఁగకన్నది దానినేల జంకించెదు వెలఁదిరో యింకొక్క విడెము సేయు
మఱచి పల్కినది యోమగువయా యెలనాగ మెడఁ బచ్చికస్తురి మెదిచియలఁదు
నగుచునన్నది దీనిదగుతప్పుఁ జూడక సందిళ్ళఁ బూయవే గంధమతివ
కనలనేటికి వీడ్వడఁ గప్పుకొన్న। మగని దుప్పటియిచ్చి రా మగుడననిన
నతివ బంగారు నరలోనికరిగి మిగులఁ। బెరుగు సిబ్బితి చేగడెఁ బెట్టుకొనియె.

గీ. ఇట్టులరణ్యోనఁ జొచ్చిన యిగురుబోఁడిఁ । గల్లఁ జేసితిమని చాలగారవించి
పిలుచుకొని వచ్చి సకియలు పెంపుసేయ । నలరె సీతీవిఁగొన్ని నాళ్ళురుగుణలత.
క. పెలపెలఁబాత్రె న్నాగ మూం । ర్పులు మిక్కిలి సందడించెఁ బొక్కిలి పరిసేన్
నలుపెక్కెఁ జన్నుమొనలన్ । నెలకొని యప్పైదలికిని నెలమసలంగన్.
చ. కడుబలుపయ్యె నెన్నడుము క్రొంబుగ వాచవు లుప్పతిల్లె నన్
బొడ్డవులు క్రేఁకమయ్యె మదిఁదోఁచెను గోర్కులు పాటలాటలన్
గుడుపులు నించవయ్యె మతికూర్కులు దప్పియుఁ జాలఁబుట్టె నె
న్నడలు దడంబడంగాఁగె నాతికిఁ దొమ్మిదినెల్లునిండఁగన్.
వ. అంత.
క. లలినానెలఁతకు యదువనఁ । గలిగెం గొమరుండు కలిమి కలికికి మనుఁడున్
బలె రూపు సొంపునన్ రా । కలిమియు బలిమియును దనదుకైవడిఁదోఁచన్.
వ. ఇట్లుగలిగిన యక్కొమరుండు పెరుగుచున్నయెడ.
గీ. కలిమిదైవార నయ్యింతి గనియె మఱియు । నలరిదుర్వాసుఁడను రాచకలువ తేఁని
గట్టుదొరపట్టి కూరిమి గడలు కొనఁగ । నాలుమొగములు గలిగినయతని బలెను.
వ. ఇవ్విధంబున పెటిదంపుఁ గడిమిమగఁటిమినింగడునమరుకొమరులంగాంచిమించిన
సెరులంగొఱలు దేవయానం జూచి శర్మిష్ఠ తనలోన.
క. పెనిమిటినిఁజెంది కొడుకులఁ । గనమఁగువలు గోరుకొందుఁ గలదటువలెనె
పెన్మిమిటినిఁజెంది కొడుకులఁ । గనియెనుగదె దేవయాన కణఁకెట్టిదయో.
క. ఏమైనకొనఁగలదిఁక నే । గోమునరా కాసితేని కూఁతురఁగా నే
నోములు నోఁచితినో యీ । బాములఁ బడవలసె ననుచుఁబనువుచునుండెన్.
క. అంతట నాకనాఁడింతులు । సంతసమునఁ గొల్వఁ బైఁడిలెజగ్గి లెపైఁ జే
మంతుల మానవులోవిరి । కొంతపు వేల్పనఁగ రాజు కొలువున్న యెడన్.
మ. కుసుమంబద్దిన వల్నె పయ్యెద చెఱంగున్ ముంగలం జెక్కి వె
క్కసమైయొప్పెడు గబ్బి గుబ్బ చను క్రేఁకంబానఁగాలేక గొ
నసియాడన్ మొలనూలిగంటలు లొగిమ్రోయన్ గొమ్మయొక్కర్తు వ
చ్చి సుమూళంబున మ్రొక్కికానుకొసఁగెం జెంగల్వలాతేనికిన్.
ఉ. ఆవిర్మలట్లాసంగికడునర్మిలి తోడుతఁ గొమ్మ మోమునన్
దావికి వ్రాలు తుమ్మెదలఁడాఁ బలుమాఱును జోఁపుకొంచు నే
దేవర తోఁటఁ గాచుపాలఁతిన్ వినుమచ్చట సొంపు మీఱు పూఁ
దీవెలు విన్నవింపఁ జనుదెంచితి నిచ్చటికంచు నిట్లనున్.

మ. సురపొన్నల్ కలిగొట్లు పిండుగలు ఖర్జూరంబు లబ్బెండలున్
గురివెందల్ పొగడల్ మొగళ్ళు విరుగల్ గోరంటలున్ సంపెఁగల్
గరుగుల్ జిన్నలు దాడిసమ్మలు మొగ్గల్గా ద్రాఁకలు లొక్కుమ్మడిన్
విరులం గన్నుల పండువైతనరెడిన్ వేంచేసి చూడందగున్.

క. అని విన్నవించు పలుకులు । విని సంతసమొప్ప రాజు వెఱఁమకలెల్లన్
మునువడి యూడిగములతోఁ । జనుదేరం గవలి తోఁట చక్కికి నరిగెన్.

గీ. ఇట్టులరిగిన రాజుతో నేగుదెంచు । కొమ్మలెల్లను బుష్పాలు గోయఁగడఁగి
మొత్తములుగూడుకొనుచును వ్వొత్తుగాఁగఁ । గడల ద్రాఁకుల వేర్వేఱఁ గ్రమ్ముకొనఁగ.

సీ. కొమ్మ యీపొన్న పూగుత్తు లంటితివేని కొమరైన నీగబ్బి గుబ్బలాన
చెలువ యీమావి లేఁజివురంటితేని నెత్తావి నింపొందు నీమోవియాన
వెలఁది యీపూఁదీవియలనంటితేని సన్ దొడవులతోడి నీయొడలియాన
కలికి యీకొలనిలోఁ గలువలంటితివేని కడు నొప్పు నీవాలుఁగన్నులాన
యతివ యీమెట్ట దామరలంటితేని । నాడి విచారెద నేను నీయడుగులాన
యనుచుఁ బూఁబోండ్ల నెల్లఁ దా నానవెట్టి । తోఁటతొయ్యలి యారాజుతోడ ననియె.

ఉ. వన్నెగమీఁదఁ బ్రాఁకి దిగ ద్రావెడు తీవలచేత నొప్పెడుం
బొన్నలు జేఁడ చూచితివె పూలబెడంగున నాల్గువంకలం
జెన్నుగ వ్రేలుచున్ జడలచేఁ గడు మీఱుచుఁ జెక్కురూపు లా
క్రొన్నెలఁ దాల్పు వేలుపులొకోయని చూపఱు చూచి మెచ్చఁగన్.

క. బలువగు సొంపున వ్రేఁగగు । తలిరులచే మావిగములు తద్దయు మించెన్
వలరాయని తామరకెం । పుల మేడలు వోలె చల్కబోదిల కిరవై.

చ. పరువములైన క్రొవ్విరులఁ బాయక కెంపగు దాడిసమ్మలన్
దిరముగఁ గ్రమ్ముకొట్టి పువుఁదేనియ లానఁగ వచ్చి క్రమ్మఱన్
దిరుగుచుఁ జాల్పలైన మగతేఁటులు మీఱెడు జేఁడ చూచితే
విరివిలుకాఁడొనర్చు నలవేలిమి మంటలపైఁ బొగల్ వలెన్.

క. పనసలు కెమ్మోకలఁ దగుఁ । గనుఁగొనఁగా గాడ్పు బల్మిఁ గారాకు వెక
ల్చిన చోటఁ గ్రమ్మునెత్తురు । లనఁ జూపఱు మదుల కెల్ల నబ్బురమొదవన్.

చ. అరుదుగఁ బువ్వుఁదేనె కడుపారఁగఁ గ్రోలుడు నన్నుఁ జూపిసన్
బరువున దవ్వగా నెగసి పాదిరి మీఁదికి మాటిమాటికిన్
దిరిగెడు తుమ్మెదల్ వలపుదేవర పచ్చలమేడ యొక్క య
చ్చెరువుగఁ బుంటి వింట నడిఁ జిమ్మెడు కస్తురియుండలో యనన్.

గీ. సన్నగఱువలిఁ దాడిమలు సారెసడలి । పొగడ క్రిందట రాలిన పువ్వులమరెఁ
చెరువగులమీఁదికినుక వేగిరమె రాఁగఁ । దారుఁగు మరు తేజి నెలవుల నురువులనఁగ.

క. రఁగొదవన్నగఁ బూచిన యా । ముఁగ్గలి సంపెంగ లవిగొ మొగినామని దాఁ
బొంగుచుఁ బ్రబలిపించిన మరు । బంగారు గుడారులనఁగఁ బరగెడుఁ గంటే.

ఉ. అల్లదె కోయిలల్ చిగురుటాకను నంజుచు నంజినల్లడన్
మ్రుళ్ళఁబడ్డనాముతోఁ చెరువరుల్ దమయల్కుడు సన్న గుండియల్
జల్లని క్రేళ్ళఁ గన్నులను జాజుదగన్వలరాచబూతపుం
బిల్లలు వోలె నచ్చెకటి మేనుల చాయలు బీతు కొల్పఁగన్.

గీ. పడఁతి యీలాగు విన్నవింపంగ వినుచు । నగుగు చేరంగ నంతట నలరుఁ దేనె
కాల్వలోఁగొన్న లేమావి గముల నడుమ । మెఱయు పొదరిండ్లలోన శర్మిష్ఠ దనరి.

గీ. అడుగుఁదామర లొక కొమ్మ తొడలమీఁద । జాఁచి పూఁబాన్పుపై నొక్క సకియమేన
నత్తమిలి మోముతావికి నలము తేంట్లఁ । జూచి నెత్తమ్మిక్రొవ్విరిఁ జోఁపుకొనుచు.

క. గరగరికనుండి రెండవ । మరుఁడుం బలె వచ్చు తేని మైపొల్పు మదిన్
బారిపొంగఁ గలఁపఁగఁ గూరిమి । కరమెలమిన్ మొలక లెత్తఁగనుఁగొని తనలోన్.

శా. ఈ రావేలుపు తేఁడు తామగఁడుగా నేనోముల నోచెనో
కా రాకాసులే మొజ్జకూఁతురనుచన్ గాఢోన్నకోర్కుల్ మదిన్
క్రేరల్ పెట్టఁగ లోనఁ బూవిలుతుఁడున్ ప్రేరేపఁగా నంతటన్
జేరంగాఁ జనుదెంచు రాజుఁగని లేచెన్ బాన్పుపై సిగ్గుచున్.

గీ. ఇట్లు లేచి తేనె కెదురేగి తనచేతి । కమ్మదమ్మిఁ గూర్మిఁ గానుకిచ్చి
యొడలఁ దనరు కెంపుఁ దొడవుల కెంజాయ । నిక్కుఁబుడమిఁ జాఁగి మ్రొక్కెనపుడు.

వ. ఇట్లు మ్రొక్కి తేని సమ్ముద్రియ గద్దెపైనుంచి తద్దయు నుద్దవిడినతని మీఁది తమకంబు గమకంబొపర్వ నతని మదియుఁ దంపయిం దగులుటన్ దెలిసి కలికి చిలుకలు గులుకు కిలకిల కులుకులు దొలఁకు నెలఁ బొలుపుల నెలవుకోలు ప్రపలువలుకులు జెలుక మెలఁకువ నయ్యయాతికిట్లనె.

క. వినునన్నేలిన నెలఁతకుఁ । జనిమిటివైనపుడె నాకుఁ జనిమిటివగు దె
ట్లన నాలుఁగొడుకు వరువుగు । ననునవి పాయనివి చదువులందును వినవే.

క. అదిగాన దేవయానిన్ । మదిఁ గైకొని నట్ల నన్ను మన్ననమీఱన్
గొదలేక యేలు నెలుము । వదలక వలతేని బాలి వడిఁ బడకుండన్.

గీ. అనుడుఁ దాయ్యలి యిట్లను నయ్యయాతి । కొమ్మ నినుఁ దెచ్చునాఁడు శుక్రుండు నాకు
నప్పగించుచు నొక్కటి యానతిచ్చెఁ । బడక నావలి గాఁగ దీనిని నరుపు మనుచు.

వ. అని పలికి సుతని యానతికి వెఱచి మిగుల నమ్మగునపయిం దగిల్చిన తనమది
మగిడించి నగరికిం జనియెనంత శర్మిష్ఠ మరుబారికి లోనై.

ఉ. చెక్కుటఁ జెయ్యి చేర్చి సెగచిందెడియూర్పులవేఁడి మోవి తాఁ
బొక్కఁగఁ గంటినీటి తెలిబొట్లు చనుంగవ మీఁద రాల తోఁ
డిక్కడి కేలవచ్చె నను నేటికి నెవ్వగ పాలుసేసె నే
నెక్కడ నివ్విరాలి దరియింతుఁ దలంచఁగ మించు కాఁకలన్.

సీ. తావులు నెఱసి యేతావులు నిండంగఁ బొదలి యుమ్మాఁకులు పూయునేల
పూచెఁబో యీతోఁటఁ గాచు తామరకంటి పోఱు విన్నపముఁ బాఁజేయునేలఁ
జేసెఁబో యిదిగుటి చేసి యారావెల్వ తెఱవలుగొల్వనే తేరగల
యేతెంచెఁబో వేడ్క నింతయుఁ గనిపోక చెలువుఁడియ్యోఁకు వేంచేయునేలి
కోరి వేంచేసెఁబో లోని గుట్టువిడిచి। మించు కూరిమి నేనె పైకొంచు వేఁడ్కఁ
గోసరి డాసిన నతఁడియ్యకొనక చనఁగ। వలపుబలిమియుంచుకొని యిట్లు కలఁగ నేల.

క. అనుచు న్నిక్కలి మదిలో। ననలెత్తెడు కోర్కిచేత నలఁగుచుఁ జెలు లె
ల్లన్ను జేరి వేఁడుకొనఁగనన్। గినియుచు విడెమొల్ల కారగింపక వగతోన్.

లయగ్రాహి.

అంచయొబోద నడపించ కలచిల్కఁ జదివించక నెమళ్లాదమనెంచఁ దగఁ గానా
డించకొగిఁ బారువపుఁటించు గులుకుబ్బి నఁదలంచక జవాది మెయినించక ననల్ గో
యించక కురుల్ విరులు నించి జడనీటు సవరించ కలవీణె మొరయించక కొలంకుల్
గాంచక తలంగి కడునించు విలుకాని సెగనుంచుకొని వేఁడిమిగలించు మదినుండెన్.

మ. జగమైసొంపుమ దమ్మిమైమఱుఁగు రాచెంగల్వ చేకత్తియున్
సిగపూ మొగ్గలు తాల్మితుల్ చిగురు కాసెన్ జెక్కెనన్ జాలఁబో
ల్పఁగుపున్ గేడఁగి రేకువంకియును జాయల్ మీఱఁగాఁ బువ్వుదీఁ
గెగుడెం దావలరాచయొంటరి కడుం గేడింపుచున్ జిమ్మినన్.

ఉ. కన్నులనీరు గ్రుక్కుకొని కాఁకలమైఁ దెరలంగ నుత్తపుం
జన్నుల మీఁది మత్తియపుఁ జాయలు వేలొకజాడఁ గాఁగ నె
క్కొన్న విరాలిచేఁ దలఁకు కూరిమి నెచ్చెలిఁ జూచి విన్ననై
కన్నియ లందఱుం దమకుఁ గన్నుల నీరొలుకం గలంగుచున్.

క. కంటిరె చెలువలు వాలుం। గంటిని పూవింటిదంట కాఁకలు తనమై
నంటిన నోర్వక పొరలెడి। వింటిరె చలిపనులు సేయు వెరవిఁక వలయున్.

రగడ.

అని పల్కి చెలులంత నలరుఁదేనియవాఁక । కనుపట్రోవులలోని క్రపహటుల మోక్క
నడుమఁ జెన్నొందు పొన్నలలోన లేమావి । కడ నొప్పు గొజ్జంగికమ్మ క్రొవ్విరి తావి
తిలకించు నెలరాఁ తిన్నె మీఁటటుఁ జాలఁ । బోలఁ పొసుమంచి కప్పురపుఁ బల్కుల మేడల
గావించి యందుఁ జెలిగవ్వ రేకులు నించి । యావెలఁదుకఁ దెచ్చి యందు పైఁ దగనుంచి
వాంచి గందపు మేన పూఁటి మాటికిఁ బూసి । మించు ముత్తె ప్రసరుల్ మెడ క్రిందుగా వేసి
తమ్మి మొగ్గలు దెచ్చి తలగడల్ గాఁ బెట్టి । క్రమ్ముకో లేఁదూండ్లు కడియముల్గాఁ జుట్టి
కరము ప్రప్ప చీని చెంగావి వల్వము గప్పి । విరుల తేకులఁ జాలఁ వెలఁది మీఁద నువిప్పి
తలిరాకుఁ దగ మొట్ట దమ్ములఁ గీలించి । పలుమాఱు మాఁగి పైవలిని లాలించి
చలి పనుల్ గావింప జాతినూనుట లేక । బలియంగ లోఁగి యప్పుడఁతు వెల్లను మ్రూఁక
లగుచుఁ దాళఁగఁ జాల దక్కటా యిక్కొమ్మ । వగల గాఁగుచున్న దెవ్వరు పూఁప్పఁగలరమ్మ
యనుచు నెమ్మదిఁ దాల్మి యులరించఁ కొని చేరి । ననవిల్తు మాఱనంపలు మనంబునఁ గోరి.

చ. వలపుల రాయ యిచ్చిగురు వాతెఱ కొమ్మ నలంచు పెల్లన
వ్వొలసుల బోనపుం దొరకుఁ బుట్టిన గాదిలి కూఁతు రంచు నో
పొలయక యాఁడు దానిఁ బెగఁ జూచిన రోయరె నిన్ను నయ్యయో
తెలియుము పూసికుఁదఁ డ్రిపగ లేఁమ నెదీఁ గల్గించి నంతటన్.

క. పగచాటును నీ యెడ న । ట్లగుట యెఱింగియును బలియు నామ కతన ని
న్నగుచున్ జెనకెద విట్టిది । తగు నే వలరాజ దాసిఁ దలపోయవుగా.

చ. వలపుల రాజ నీవు దళవాయల జాబిలి చిల్క తేజి తూ
పులు నన లెంచ విల్ చెఱకు పొందుగఁ దేఁటులు నారి బొందడీ
తలి రేఁ మావియంపపొది తా రెడు తెమ్మెర చుట్టమిట్టి నీ
కలవడు పెట్లు మొక్కలపు టుద్దదము లబ్బురమెంచి చూచినన్.

సీ. నిగిడి తెర్వరుల గుండెలు ఝల్లురనఁ జేచ్చి పెళపెళనార్చు కోవెలకుఁ దోడు
పలుకు పల్కునకు నింగలపు వేఁడిమి చిల్కఁ గిలకిలల్ గులుకు చిల్కలకుఁ దోడు
మొనసి మేనులు చాలుక్కని పొక్కఁగా దూరి మెఱుముచు విసరు తెమ్మెరకుఁ దోడు
వీనులఁ గ్రొవ్వాఁడి వేఁడి సూదులు సొన్పు లాగున మ్రోయు తేంట్లకును దోడు
నీవు పగవాఁడవుం బలె నెలఁత మీఁద । నెగలు వెదవల్లు వెన్నెలల్ దగుల వైచి
నగుల స్నేహ గీగి నీకు న్నదగు నె యకట । చన దెయిఁక నైనఁ జెలినోమఁ జందమామ.

వ. అని వలరాయని నింగలువలరాయని దూఱి పలికి యచ్చెలువలు వెండియుఁ జలువలు గావింపం దలంచిన నం జూచి యా చిగురుఁబోఁడి మెల్లన నిట్లని యె.

క. కనత్తె జాలి యొక్కడఁ । గడవట్టుననట్టి చల్వగా వించెదరీ
య్యడియాసలేల యింకను । విడువుఁడు నామీఁదికూర్మి వెలఁదుక లెల్లన్.

వ. అని పల్కునెడ.

గీ. సకియ యొక్కల్లఁ దడియఁగా జాఱె నెఱయు । చున్న కన్నీళ్లు మిక్కిలి నొనరెఁ జూడ
నలిగి వలరాయఁ డేసిన యలరుఁ దూపు । లపుడు దాఁకిన మంట చల్లార్చునట్లు.

క. ఈడగునో కావో యని । చూడన్ హత్తించునట్లు జోటి యడుగులన్
జేడియ లొత్తిరి కెంజిగు । రోడకు నాయుకతాళు మొక్కంతనుచున్.

మ. దళమై మించువిశాలి కాఁక బెఁగడుం దాళంగఁ బూఁబోఁడిపై
కలయన్ జల్లినకప్పురంబు మరె పీఁకన్ రేసి పూవిఁటివాఁ
డలుకం బల్మఁ దూపుఁ గ్రొవ్విరుల నేయన్ రాలుపొప్పొల్పునం
బలె నెత్తావులఁ జల్వలోని మిసమిసల్ పై పైఁగడున్ బర్వఁగన్.

గీ. ఇంతి యొక్కడ నీ దేతె దిట్టజాలి । నక్కటా యని మేనెల్ల నలమి నిమిరి
కడిఁది తమ్ములనవ్వెడు కన్నుదోయి । నెలఁత యొక్కతె తేటపన్నీటఁ గడిగె.

వ. ఇట్లైలాగునం దెలవలెల్లం జలి పనులు సేయుచుండిరంత నక్కడ యయాతియు
శర్మిష్ఠం జూచినయది మొదలు తనమది బొదలు వలరాచ వేఁడిమి వాఁడిమిం
బొక్కుచు నొక్కయెడ జూడఁగూడిన మేడలో నేకతంబున నుండి తనలోన.

సీ. ఆకొమ్మ వేనలి యడుగుఁ దమ్ములు నాసల్ చిఱునొసల్ బొమలును మెఱుఁగుఁ గొడలు
కన్నులు పిఱుఁదు మొగంబు నెన్నడుము లేఁజెక్కుల్ బొక్కిలి చెవులు నారు
తెలినవ్వు గబ్బిగుబ్బలు మోవి మెడయుఁ బల్వరుస చేతులు వ్రేళ్ళు వాఁడిగోళ్ళుఁ
బలుమఱుఁ దేనియలొలుకు పల్కులు చెన్నుమించు లగేరు నెమ్మేని యొఱపుఁ
దగిలి మదిలోన నిలిచి యొంతయుఁ గలంప । నుక్కడఁ బలు మాఱుఁ దలపుచును స్మరనుచు
మోసపోయితి నంచును మోము వాంచి । చెయ్యి చెక్కుటఁ జేర్చి తాఁ జిన్నఁబోయి.

వ. అంతకంతకు వింతయై యొంతయుం బలియు వలరాచకాఁక వ్రేఁకంబునం బ్రొద్దు
గడపుచున్నంత.

సీ. అలమి నెమ్మది నున్న యతివ లేనవ్వుచే బలె నాడ లెల్ల వెల్వేలుకఁ బాటె
నాచాయమై రంగు లను తేనెసోనఁ జేఁదిలకించె ననఁగోర్కి తీఁగసాఁగె
నానెలఁతుక మొగంబు నుసింపు నెలతెల్వి బలెఁ గన్నుఁదమ్ములు సోలవఁ బ్రాణఁగె
నా లేమ చనుగొండలాన లేమి నిలఁ బోలె సాఁగిసిట్టూర్పులు సందడించెఁ
జ్ఞానితనలోన నిల్చిన పొలఁతి నెపుడు । మఱితలం పేమియును లేక మదికి మఱుఁగు
నీగుడు చూపులఁ గనుఁగొంచు జగము రిత్త । చూపుల నె చూచు మరుమరుల్ సోఁకి కలఁప.

క. తనమదిలోపల రాఁజెడు । ననలుని కాఁక చేత నలిసలియగుచున్
మును కొన్న సెగలకోర్వక । నను బాస్పిన నున్న రాజునుం గని చెల్వల్.

క. తాలిమి గలరాజగుటన్ । దాళుచునున్నాఁడు గాక తరమగునా యీ
జాలిం బడఁగా నిప్పులు । రాలెడు మైకాఁక నిల్ప రాదెవ్వరికిన్.

క. ఈ రాజునకిపుడొగి నా । తీరునఁ గావించి సేదఁ దీర్చమిదగునా
యోచుచు నా మై సెగలకుఁ । జేరఁగ రాదనుచు నెడము సేయందగునే.

వ. అని పలికి.

క. సింగారపుఁదోఁటకుఁజని । చెంగల్వల కొలనిపొంత జిన్నెలకడ సం
పంగియల నడిమి యనఁటుల । చెంగట లేమావిదండ సేమంతులలోన్.

సీ. గందంపుఁబాడి పైచిగట్టించి యందుపై నెలరాలఁగట్టిన నెలవునందుఁ
గల్వరేకుల మిద్దెఁ గావించి యాచుట్టు రువేరు దడిగట్టి విరుల తేనెఁ
బూసి ముత్యాల కీల్బొమ్మలు లేఁదూఁడుఁ జిమ్మనగ్రోవులఁ జిమ్మ నెగయ
పన్నీట జొబ్బిల్లు పచ్చకప్పురపుఁదీనె మీఁదఁ బుప్పొడి రవ పాదు కొల్పి
గడితపడ నట్టి వెన్నెల కలుకుల మర । మెఱయు వజగండ్ల బొమ్మల మేటి వగ్గలు
చూచియుం బలెగగ్గఁగఁగఁజొచ్చుకుడనరు । నందుమీఁదటఁ దెచ్చి యయాతినునిచి.

గీ. మింపు కార్చిచ్చు నేత నడంచఁ బోవు । తెగువ నారాజు మైసెగల్ దీర్చఁబూని
చలువలొనరింప సమకట్టి చెలువలెల్లఁ । గదిసి యమ్మేటి మేని కాఁకలకుఁ గాక.

సీ. పొరవారనిండఁ గప్పురమును ప్పతిల్లెను విరిసరుల్ కొప్పులఁ గరఁచుఁ జెరివి
చినుఁగని యనఁటి తేఁజిగురుగుబ్బలమీఁదఁ గదియంగఁ జేర్చి పయ్యెదలొనర్చి
జిలుఁగుఁజేలలమీఁదఁ జెంగల్వ విరిరేకులెలమి గాఁ గూర్చి యుంపలరఁగట్టి
గములు గా నెలసూడిగములు గాఁ జేతులఁదలము గాఁ దూండ్లు గుత్తములు చేసి
మఱియు నందఱుఁ దమ్మునేమఱక వచ్చి । తెఱవలెల్లను మిగుల వాతెఱలు వాడ
విరుల తేనియనించి వావిరిని గంద । మసలు గావించి మేనుల నలఁదుకొనుచు.

సీ. కురులలోఁ గదియంగఁ గ్రొత్త ప్రప్పొడిఁ దెచ్చి మేదించి నించెను మెలఁత యొకతె
యివము గా వట్టి వేళ్ళిడ నొప్పు పూఁదేనె యొడలిమీఁదను జల్లె నువిదయొకతె
చెలరేఁగి యనుకైన సిరిగందమున ముంచి విరుల వీచోపుల విసరెనొకతె
పదనిచ్చి పచ్చికప్పంబునఁ గావించి కడియముల్ దొడిగెను గొలికి యొకతె
కలయఁ బన్నీటఁ దడిపిన తలిరుఁ దెచ్చి । యడుగుఁ దమ్ముల నొత్తెఁ దొయ్యలి యొకర్తు
చాలు చెల్వగు నాణిముత్యాల పేరు । లతనియక్కునఁ గీలించె నతివ యొకర్తు.

క. [illegible]స్పటికతెనికినలఁదిన | కప్పురపుం గందమలరెఁ గస్తూరియుబలెం
గప్పురపుచాయలందగి | ముప్పిరిగొను మేనికాఁక ముంచుకొనంగన్.
క. చెలులందఱు నీకరణిన్ | బలుదెఱఁగులఁగలుగు చలువపనులొనరింపన్
వలరాచ కాఁక మిక్కిలి | తలచూపి ఱొప్పెకింతయైనఁ దరలక బలియన్.

లయవిభాతి.

చెల్వలొనరించు బలుచలువలకుఁ బైనలముకలువలకుఁ జేఁటులను బులువలకు లేఁబూ
ములుకులకు రాచిలుక పలుకులకుఁ దెమ్మెరల బెళుకులకుఁ గ్రొన్ననల తళుకులకు నెమ్మె
యలపులకుఁ బారువపు సొలపులకుఁ గ్రమ్ముకొను తలఁపులకు మున్మరవు వలపులకుఁ దెల్వె
న్నెలలకును గొమ్మగినుకలలకును జెంతఁదగు మలలకును గొర్బులను వలలకును లోఁగున్.
వ. ఇట్లువలరాచసెగల మిగులనొగులు రాజుం గనివగలం దగిలి మగువలిట్లనిరి.
క. మరుఁడా యెవ్వరితోడన్ | బిరుడావడి వేఁడివాఁడిపూఁదూఁపులవే
పరుడా సినొంపనక్కట | యొరుఁడా యీరాజు నీకునొగిఁ దలఁపంగన్.
క. వలరాయా వేఁడిననీ | తలరాయా ముంచుకైనఁ దలఁపవు మదిలోఁ
గలరా యీ రాజునకెన | కొలరానే లయ్యతిట్టు కుడువఁగనీకున్.
వ. అనిపల్కునంత.
శా. ఆసంపెట్టిమఱుండు నొంప వగతో నానేల పేఁడిమ్మెయిం
గాసిం బొందఁగఁ జూడలే కఱుగు పీఁకన్బొబ్బ వేఁగ్రుఁకినన్
బాసెన్ జక్కవ లిర్లు చాలబలిసెన్ బైఁజంబుఱండొప్పగాఁ
గాసెన్ వెన్నెల పిండిచల్లినకడంకన్ గల్వపూపండువై.
వ. అప్పుడు.
క. వెడవిల్తుఁడలరువింటను | గడువడి విరిదూపులేర్చి కదియింపుచు న
ప్పుడఁతిన్ రాచంద్రురునిన్ | గుడియెడమల నేసియేసి కోయని యార్చెన్.
గీ. ఆంసశక్తి మిక్కిలి యలమికొనుచు | మించువెన్నెలపేఁడిచే మేనువాక్క
బువ్వుఁబానుపుమీఁదటఁ బొరలి పొరలి | వలపురాయని చేఁత చేఁ దెలివిదఱిగి.
చ. వెతవెడఁ గన్నుమాయఁ బలవించుఁ గనుంగవ విచ్చి రాజ నన్
విడువఁగఁ బాడియేయను గనింగని యేచెదు మేని వేఁడినే
మిడుకఁగ నీకునాఁడుకోల మేలటవేయను నల్గిపోవ నా
యెడనొక నేరమైనఁ గలదేయను నన్నిటఁ జూడవే యనున్.
వ. ఇట్లుపలికి మరునిపూములుకులకులుక నక్కలికిం గ్రమ్ముకొని క్రమ్మఱ యిమ్మరం
బగు తెమ్మలు గ్రాఁచింపం గొమ్మలు గడంగి.

సీ. అతివమిక్కిలితూలె నాలసింపఁగనేల చల్లఁగాఁబన్నీరు చల్లరమ్మ
చేడియమైసెగ న్వాడె నీచిగురాకు పరువంపుఁ గ్రొవ్విరుల్ పఱవరమ్మ
పొలఁతికినివతుగాఁ బూఁదేనెలో ముంచి విరులవీచోపులు వీవరమ్మ
నెలఁతకుఁగొజ్జంగినీట మేదించిన యలరు కప్రము మేననలఁదరమ్మ
తెరలుచున్నవి తొంటిమొత్తములు దిగిచి। క్రొత్తలుగఁ దెచ్చి పాలిండ్లఁగూర్పరమ్మ
మఱుని వేఁడిమి యెంతయుఁ బలసెనమ్మ । వెలఁదికడుసోలె నేమిగావింతమమ్మ.

గీ. అనుచు వేవచ్చి చెలిపనులొనరఁ జేసి । యలసి వేగింపఁ జాలకయతివ లెల్లఁ
గన్నుఁదమ్ముల్ మోడ్ప నక్కలికి యంతఁ । దనదుదండకు రాజు రాఁదలఁచి లేచి.

క. వడిఁ గేలువట్టుకొనినన్ । విడువిడుమని పోవ నట్టి వెరవైనన్ వెం
బడి నేగెడు తలఁపున గ్రొ । మ్ముడి యొకచేఁ దురుముకొనుచు మోమలరంగన్.

సీ. వేఁడిమి వెదచల్లు వెన్నెలవడకునై చెయ్యి మోమున మాటుచేసికొనుచు
నుడికినట్లున్న పుప్పొడి మెట్టఁగాఁ బొక్కనడుగుఁదమ్ములు కేలనలముకొనుచు
గట్టులవలెనొప్పు కపురంపుఁదిప్పలఁ గడునెక్కి నిట్టూర్పు విడిచికొనుచుఁ
జిలువలవలె నసుగుల యడుగునఁబడు నెలదీఁగియలఁ ద్రొక్కి యులికిపడుచుఁ
బూని తెకతెక మనియెడు పువ్వుఁదేనె । యొడలిపైఁగాఱ చుఱ్ఱన నూఁది కొనుచు
నాలిగామపు సోఁకినఁ గీలుకొన్న । సెగకుఁ జిగురాకు మేనిపైఁ జేర్చుకొనుచు.

క. మరుఁడార్చి పోకపోకని । విరిదూపులఁ గదుముకొనుచు వెస నేయంగా
నరిగి పొదరింటికడ వా । విరిఁ జెలితనుఁ బ్రోచుతేని వెదకుచు నుండెన్.

వ. అంతనక్కడ,

ఉ. వేసవిక్రొవ్విరుల్ దొరఁగ వీనులఁ గమ్మలడాలు పర్వఁగాఁ
గానసియాడఁగాఁ గలికి కన్నుల చూపు విరాలిఁ గొల్పఁగా
మేనుతళుక్కునన్ మెఱయ మించునుబోలె నెలంత వచ్చి క
న్నాన యయాతిపుట్టు నడియాసల దిగ్గన లేచి యిట్లనున్.

క. మగువా యిచ్చోనిట్టిది । నగవా సెగపాలుచేసి నను నేఁచంగాఁ
దగవా యెుఱపున నీకున్ । దగువాఁడను గానె యనుచుఁ దహతహఁ జనుచోన్.

సీ. కదుమించు నసఁటిన గంబముల్ తొయ్యలితొడలంచుఁ బలుమాఱుఁ దడవి చూచు
జిగిమీఱు మావి లేఁజిగురాకు పూఁబోఁడి మోవియంచును బంటి మొనఁ దనర్చుఁ
బోలుపైన జిగినొప్పు నలరుగుత్తులఁ గొమ్మ గబ్బిగుబ్బలటంచుఁ గౌఁగిలించు
మెట్టుదామరలింతి మెట్టుదమ్ములటంచుఁ దక్కకుమ్మని సాఁగిమ్రొక్కఁబోవు

జిక్కితేనిగా లోలకంగఁ గలవరించుఁ గలికి చిలుకల పలుకులు కలికి యెలుంగు
లనుచుఁ వేమారులుఁ జెవియొగ్గి యాలకించుఁ గుండె ఝల్లన నేమె మొకోసరి పలుకు.

వ. మఱియును.

ఉ. చెలువటు నిల్చినట్లునఁ జేతులఁ జన్గవ నొయ్యఁ బ్రేంచు వే
నలితగ నవ్వు మోముగను నవ్వుఁ బిలుంబునఁ గేలమర్చుఁ జె
క్కిలి పులకల్ గవుంగిటనుఁ గీల్కొలుపున్ బిగియించి యంతలోఁ
దెలియు నయో యనుచున్ మగుడఁ దివ్వఁగఁ బోవు నెలుంగుఁ గ్రమ్మఱన్.

గీ. అరిగి యాచంద్రమునను నెయ్యంబెలర్పఁ । గౌఁగిలింపుచుఁ గూర్మిమిగ దిసి తేనె
మోవియానుచుఁ జెక్కిలి ముద్దువెట్టు। కొనుచు లోలోనఁ గన్నీళ్ళు గ్రుక్కకొనుచు.

వ. చనిచని యచ్చటికిం దనయట్లు ముక్కు వచ్చి యున్న శర్మిష్ఠం గాంచి.

క. మరుఁడు తమి కేఁచఁగా డ । గ్గరి యంతటుమిగులఁ జెలఁగు కాఁకల చేనాం
— డ్రాయలం గౌఁగిటఁ జేర్చుచుఁ । బరికింపుచుఁ గల్లయనుచుఁ బాయుచు మగుడన్.

క. కదియుచుఁ బాయుచుఁ గ్రమ్మఱఁ । గదియుచుఁ బాయుచును మిగులగరకరి తోఁ బోఁ
బ్రాదరింటిలో నికింజని । వదలుచు దిగజాఱు జిలుఁగు వల్వలతోడన్.

చ. మునుపుగనాలి గాఢపు వడిమ్ముఁ దరెటి గియ పాల్పనొప్ప క్రో
న్ననల యరంగు పైవలరి నవ్వుచు వాతెఱలానియానచున్
దనియక క్రింకుమీఁద గుచంబ దార్చి కవుఁగిటఁ జేర్చుచున్ గడున్
జెనఁగిరి చిల్కతేజిదొర బీరము వాఱఁగ వారలిద్దఱున్.

క. ఈచందమునందగ వల । రాచపనుల్ దీర్చుకొనుచు రహిమీఱంగా
నా చెల్వయు రాజును మది । నీ చెయ్వులు నిక్కమనుచు నెఱఁగిరి తమలోన్.

చ. చెలువుఁడు మిక్కిలిన్ దెలిఁ జెందకమున్న నెలంత యొక్కచే
వలువ చెఱంగు పట్టి కొని వావిరిఁ దక్కిన చేల చన్నులం
దలముచు మోముదమ్మి తనయక్కునఁ జేర్ప నెఱింగి పేఁడు వే
నలిదగఁ బట్టి యెత్తుటయు నవ్వుచుఁ జెన్నిటిఁ దేల్చె నింపులన్.

వ. ఇట్లు వలరాచకలయికల బలియికల సొలపు వలపులు గొలుపు తలంపుల నబ్బాలి
యుండునుం జెల్వయు నలరుచున్నంత.

చ. చెలువలు మేలుకాంచి తమ చెంగట రాజునుగాక యయ్యయో
నెలకొను కాఁక కోపక నేఁడెటు వోయెనో మించి కాయు పే
న్నెలవడదాఁకి పూఁబోదల నీడకు నేగెనో మావిచూఁ పెనో
కలువల వింటఁ గన్గొనెనో కాఁగిన క్రొవ్విరి తేనె మెచ్చెనో.

క. మనమరిదియు నిప్పగిదిన్ । వనరంగాఁ దగునె వెఱ్ఱివారమె యకటా
పనిపూని తేనె వెదకం । జనవల దేయంచు నొక్క జవరాలు వడిన్.

సీ. అతని చూపఁ జనుదేర నటకమున్
వెడలి చనియెడి శర్మిష్ఠ వెదకఁదలఁచి
యున్న పూఁబోఁడి యలరి యయ్యెడఁ గాంచి
తనకు నెలంత కీయుంచు నెంతయుఁ దలంచి.

క. ఒక్కతె వెన్నుని టుకువత్తురె । యక్కట రేయెండలోన నడుగుం డెట్లున్
బొక్కఁగఁ జిలుకు తెవెన్నుం । జెక్కిలి గొట్టంగ నేమి సేయుదుఁ దల్లీ.

క. మింటికి సిక వేల్పు మిక్కిలి । కంటికి సెకన్ నొచ్చి పుట్టుగా నక సోఁకున్
వెటుఁబడి మరుఁడు వాలుం । గంటీ రాఁదగునె యెంతగండము గడచెన్.

వ. అనుటయు నక్కొమ్మ యిట్లని యె.

25460
25.3.73

క. అమ్మా నిన్నేలినయు । మ్మద్దియఁగాను బుడమి నసముదలిర్పన్
దిమ్మరు యయాతి యుడిగపుఁ । గొమ్మన్ మా రాజు మరుఁడు గొల్పు విరాలిన్

క. బడలినఁగని మే మెల్లన్ । గడుఁ జల్వలు చేసి యలసి కను మోడ్చిన నై
క్కడికిన్ బోయెనొ యడుగి । యెడకుం బొందరి టివాఁక నే తెంచెనన్.

క. విని యక్కొమ్మ యు దానికిఁ । దన రాక యనట్లు చెప్పి తళి రుం బోఁడీ
మన మిప్పుడ వెదకుదమా । యనవిని శర్మిష్ఠ లేచి యరుదెంచుటయున్.

చ. పలువ నిజాలఁ బెట్టి కడవారి బలెన్నె నరుందం పక
పాలఁతుల నందఱన్ని దుర పుచ్చి హళాహళిగాఁగ నొంచున
వ్వలపుల రాజ్ఞి గూర్ప నిటనచ్చి పెనంగితి తేనెఁ గూడియో
మెలఁతుక మార్తుచేఁ దగిన మిన్నతిగొంటు గదమ్మ నేరుపుల్.

సీ. అనుడుఁ గన్నుల జాఱించి యతివ మీఁద । తేఁ దాకయుల్క యప్పుడే పూనిపల్క
నలరుఁబోఁడిఁ గనుఁగొని యయ్యయాతి । యుడిగపుఁ గొమ్మ నవ్వుచుఁ బడఁతిఁ జూచి.

క. మొగముం బోలిన యంతనె । పగఁ గొండల మీఁదఁ జాలఁ బదిలంబుగనీ
తొగరాకొమరుల ను నిచితి । నుగువానిఁ జెనకఁ దరమె మా బోఁటులకున్.

సీ. అస్సిన మోమరవచ్చి యయ్యలరుఁ బోఁడి । తనదు పయ్యెద యొక్కింత తలఁగఁ జూచి
సిగ్గు చేనిండు వెలపొచ్చు చిన్ని మెఱుపుఁ । బోలెఁ బూఁబోఁడ సొచ్చె మైపొలుపు దనర.

సీ. ఇట్లు పొదఁ జొచ్చి రాజుతో నెసక మెసఁగ । నరమరలు లేని వలపుల ననఁగి పెనఁగి
యులసి చాలించి మఱియు నయ్యలరుఁబోఁడి । చిట్టకంబులు సేయుచుఁ జెలఁగు నంత.

క. తలఁపులు సుకుమారంగద । వెలితేమి యులేక యింత వంచేయఁదగునే
చెల్లతెయీవా పెనటంచును । నెలఁదుకలె తేఁగింప తేచి నెరవగు వేడ్కన్.

వృ. చెదరిన ముంగురుల్ నగవు చిందెడు నేత్రములుఁ జిట్లుగందముల్
పెదవుల కెంపులున్ నుదుటఁ జేరిన క్రమ్ముసు సొల్పుఁ జూపులున్
నిదురలు లేమిఁ గన్గొనల సంతసిన జాజు తెలర్పుచుండఁగాఁ
బొదరిలు వెళ్ళి వచ్చె లలనల్ దగ నింతియు రాచ పేళ్ళతోన్.

లయగ్రాహి.

ఇప్పగిదివచ్చి చెలిజిప్పిలుతమిన్ దగిలి చెప్పఁదగు కోరికలు గేప్పుకొనుచుండన్
గొప్పలగు పుష్పాదుల తిప్పలను గ్రొన్ననల కుప్పలను జెన్నలరునిప్పలను జాలన్
దెప్పరము గానిడిన కప్పురపుఁ దిన్నెఁ దగి యుప్పరమునైన విరిచప్పరములందున్
ముప్పిరిగొనందని పెనప్పువులవింటిదొరనప్పుడు యయాతి తన చొప్పుగొని యాడెన్.

చ. వలపుల తేఁడు సేయుకొదవంబడ కెంతయు రాజుమీఁఅలో
నలుకుచుఁజూడవచ్చెనన నంతటఁ బుట్టుగుగట్టుమీఁదటన్
జెలినిదళిర్పఁ దామరలచేవర తోఁచిన తేఁడుఁగొమ్మయున్
సొలపులతోడు తన్ నగుచుఁ జొచ్చెరిలోపలి డిడ్డి త్రోవచేన్.

క. ఇనిరే యిదిపగలనుచున్ । మది నెఱుఁగక చాలఁబొదలు మరుపోడుములన్
సదమదమగుచుండిరి య । మ్ముదితయు రాతేఁడుఁ గూర్మి మించుకొనంగన్.

గీ. సరవితోడ నంతశర్మిష్ఠయందు య । యాతి గాంచె ద్రుహ్యునను నిఁబూరు
వారు నెదిగి పుడమిలో రాజులెల్లను । గొలువఁదమరు తండ్రిఁగొలుతు రెపుడు.

వ. ఇట్లు యయాతి దేవయానయందు యదువును దుర్వసుండును నను వారి నిద్దరను
శర్మిష్ఠయందు ద్రుహ్యుండును ననుండును బూరుండును నను వారి ముగ్గురఁ గాంచి.

సీ. మునుకొన్న బీతుతో మొనసి వేల్పుల తేఁడు తన సొమ్ములెల్ల నప్పనము లిడఁగఁ
దమకుఁగల్గిన యట్టితమిఁ జూపి కిన్నరుల్ దండి పాటకుల చందమునఁ గొల్వఁ
జేరోలగంబున్నఁ జేక్చ కైపులతోడ నచ్చర పూఁబోఁడులరుగు దేర
తముఁ గావుమనుచు సంద్రముల యావల నేలు నేలతేఁడెల్లఁగానికలు పనుప
యదువు దుర్వసుఁడును ద్రుహ్యుఁడల్ల పూరుఁ
డెపుడు నేఁలేని కూర్మితో హెచ్చిపొదలి
నేమమగు తీవిఁదనయానలో మెలంగఁ
గడిమితోడ యయాతి యిష్టుడమి నేలె.

సీ. ఈకబ్బమిర్మిలి సెవ్వారు చదివిన విన్నను వ్రాసిన నెన్నఁదగిన
విడిముడిచేఁబొంగి వెండియుఁ బైఁడియుఁ ద్రవ్వితఁడము గాఁగఁ దకలి మేఆస్తి
కొడుకులుఁ గోడండ్రుఁ గూతులు మనుమలు మనుమరాండ్రును మేలిమగువ పిండ్లు
పాఁడియుఁ బంటయుఁ బల్లకీ తేనెఁగుల్ సాలలగుఱ్ఱముల్ చాలఁగలిగి
ప్రొద్దుకల్వలతేఁడును బుడమి మిన్ను । బలెను దిరమైన యునికిచేఁ జెలఁగియొగి
పెంపు వేల్పుల రాయని సొంపు నొనర । మను చునుందురు తనరు సేమముల సొంపు సం.

చ. బవరపు వేఁటలోఁ బొడలి పైకొని వేఁకపుఁ బుల్లు మూఁకఁ గై
దువయను చోంపుఁ గోల నెగఁదోలుచు నొప్పెడు రాయపక్కి సా
ళువుఁ డిభరాము శౌ తలఁపులోఁ గడు మెచ్చియొసంగు మన్నెసం
దవిలియసంబు లెల్లెసలఁ దార్కొనఁ జేసిన భావజావళీ.

క. పెనఁకువ నయందఱు జగములఁ । గొనియాడఁగఁ గోరినట్టి కోరికలొదవన్
మనుకతుబుశాహు కూరిమి । గని సిరులొందెడు నమీనుఖానా జానా.

మణిగణనికరము.

కలువల చెలి సెగకనుగలిగిన య । బ్బలియుని బలుకుల పడఁతుకఁ దెలిగ్రో
త్తలరుల వెలమురి నసమునన గుచుఽ । బలువునఁ దగువిడుపరి తనవు బలీ.

గద్య. ఇది శ్రీమదన గోపాలమంత్రివర ప్రసాదలబ్ధ సారస్వత సుకవి జన హితవచో
వైభవ భావనామాత్య తనూభవ సౌజన్యవినయ ధుర్య పొన్నికంటి తెలగ
నార్య ప్రణీతంబైన యయాతిచరిత్రంబను నచ్చ తెనుఁగుఁ గబ్బంబునందు సర్వం
బును బంచమాశ్వాసము.

---

సంపూర్ణము.

---